# బుద్ధ చరిత్రము



అనుసరించిన గ్రంధములు :

**మహాభిక్షు** by **చిక్కాల కృష్ణారావు**

**బుద్ధ దర్శనం** by **అన్నపరెడ్డి వెంకటేశ్వర రెడ్డి**

**బుద్ధుడు-జీవితం అవగాహన**

by **తిరుమల రామచంద్ర**

గద్య పద్య రచన :

**అమరవాది సుబ్రహ్మాణ్యా దీక్షితులు**

M.Tech.



# సతీ సమేత అమరవాది సుబ్రహ్మణ్య దీక్షితులు


Address :

Flat No.5; Plot 61,

Siddardha Apartments,

Siddardha Nagar,

Hyderabad - 500 038, A.P, India

E-Mail : deekshitulu_a@yhaoo.com

Mobile : 9393021360

Website: http://www.geetadeeksha.com/

ఓం

శుభమస్తు　　　　　　　　　　　　　　　అవిఘ్నమస్తు

# బుద్ధ చరిత్రము



అనుసరించిన గ్రంధములు :

**మహాభిక్షు** by **చిక్కాల కృష్ణారావు**

**బుద్ధ దర్శనం** by **అన్నపరెడ్డి వెంకటేశ్వర రెడ్డి**

**బుద్ధుడు-జీవితం అవగాహన**

by **తిరుమల రామచంద్ర**

గద్య పద్య రచన :

**అమరవాది సుబ్రహ్మణ్య దీక్షితులు**

M.Tech.



**బుద్ధ చరిత్రము**


మొదటి ప్రచురణ

ఫిబ్రవరి 2009

రచన

అమరవాది సుబ్రహ్మణ్య దీక్షితులు

M.Tech.

వెల : అమూల్యం

ప్రతులకు :

ఫ్లాట్ నెం. 5, ప్లాట్ నెం.61, సిద్ధార్థ నగర్,

హైదరాబాద్ - 38. ఫోన్ : 040-23814379

www.geetadeeksha.com

డి.టి.పి. & ప్రింటింగ్ :

కె. మురళీ కృష్ణ

9848515109




## విషయ సూచిక





## ప్రార్థన

ఉ॥ శ్రీ తరుణీ మనోవిభుదు చేరె మహిన్ అవతారమెత్తుచున్
ప్రీతిగ ధర్మస్థాపనకు వేల్పుల కావగ దైత్యమూకలన్
ఘాతుక లీలద్రుంచి తను కాచెను శిష్టుల నమ్ముచుంటినే
నాతడు బుద్ధుడై నరులకందరికిచ్చెను మోక్షమార్గమున్

ఆ॥ నేను హరినియంచు అనలేదు బుద్ధుడు
మహిమ జూపలేదు మంచి నేర్పె
తొల్లి రాఘవుండు దునిమెను దైత్యులన్
తాననంతుడనుచు తలవబోడు.

సీ॥ మధుర స్వనంబును మత్తకోకిలకిచ్చి
వాసిగాంచగ జేయు వాడెవండు
అమిత సువాసననందించి మల్లెలన్
సిరిమల్లె జేసిన శ్రేష్ఠుడెవడు?

మధుకరంబును నేర్పి 'మధుపాళికిన్ బూని'
తేనియలిచ్చిన ఘనుడెవండు
గడ్డిపువ్వును కూడ కంటికింపారంగ
చేసినదెవ్వడు వాసిగాంచి?

ఆ॥ ఆ పరాత్పరుండు అంతు తేలనివాడు
కానరాడు తాను కనులజూడ
వాడెవండు జగతి వర్ధిల్ల జేసెను
కలడొ లేడొయంచు కలత యేల?

కం॥ బుద్ధ చరిత్రము నేను ని
బద్ధతతో జెప్పుచుంటి పావనులారా!
బుద్ధుడు హరి అవతారము
బుద్ధుడు భగవానుడంచు పూజింతునుగా



తే॥ తెలుప బుద్ధుని చరితను కలదె నీకు
శక్తి? అని నింద తగదయ్య సాధులార!
జన్మ జన్మాంతరంబుల 'జమ' కుదిరిన
పుణ్యవశమున నేనిది పూని చెబుదు

ఉ॥ సంతసమేమి దక్కు మన చావెపుడోయను
భీతియున్నచో
కాంతలు, విందు భోజనము, గద్దెలు, మేడలు,
కోట్లుయుండియున్
శాంతినెరుంగలేనపుడు స్వర్గము బొందియు
లాభముండునా?
ఇంతకు మించి బోధనలవెందుకు? బుద్ధుని
బాటనమ్మెదన్



## ముందుమాట

నేనూ గతంలో సాంకేతిక విద్య చదివి 'డబ్బు' సంపాదించటమే ధ్యేయంగా బ్రతికాను. పరమాత్మ కృప వలన 'చావు తప్పి కన్నులొట్టబోయి' సుఖమే కావాలనుకునే వాడికి దుఃఖం తప్పదని తెలుసుకుని, సన్మార్గంలోకి వచ్చి, సన్మిత్రుల సాంగత్యంలో కాలం గడుపుతున్నాను.

భగవంతుడెక్కడోలేడని మనలోనే ఆత్మరూపం లేదా చైతన్య రూపంలో ఉన్నాడని అంతటా, అన్నింటా, అన్నివేళలా అన్ని విధాల ఉన్నాడని తెలిసి, ఆయనే కావాలని అన్యము వద్దని అన్నాను. నాలోని 'వాడు' న్నంతవరకూ అంటాను. మనస్సు పాదరసంలాంటిది. పాదరసాన్ని నిలపడానికి గాజు పాత్ర కావాలి. అలాగే మనస్సు నిలువరింప చేయటానికి ఒక రూపం నామం కావాలి. అందుకోసమే మానవుని మానసాకాశంలో హరి, హరుడు, శక్తి అని ఎన్నో దేవతా మూర్తులు వెలిసారు.

బాగానే ఉన్నది. కానీ ఆ దేవతలని తృప్తిపరచటానికి రకరకాల పూజలు, యజ్ఞాలు వచ్చాయి. అదీ బాగానే ఉన్నది



కానీ, దేవతా తృప్తికోసం బలులు వచ్చి జీవహింస వచ్చింది. మానవుడే తన పిల్లల్ని పెంచటానికి అంత కష్టపడుతుంటే ఈ మానవులంతా ఆయన పిల్లలే కదా. పశుపక్షి తిర్యగ్జాతులన్నీ ఆయన బిడ్డలే కదా! ఆయనకీ హింస ఎలా ఆనందమిస్తుంది? హింస లేకపోతే దుఃఖమే లేదు. నిర్మోహమే అన్ని సుఖాలనిస్తుంది. ఏకాగ్రతతో ధ్యానం చేస్తే పరమాత్మ తేజోరూపంలో దర్శనమిస్తాడు. పులిహోర ప్రసాదం చేయిస్తే పుణ్యం రాదు. ఆ పులిహోర పది ఆకలి కడుపులు నింపితే తప్పక పుణ్యం వస్తుంది. పులిహోర అంతా 'ఫ్రిజ్' లో దాచుకుని 'తనేతింటే ఏవిధమైన పుణ్యమూ రాదు.... రాదు.'

పరమాత్మని సంతోష పరచే ఇంకొక మంచి విధానం కీర్తన. ఏదో ఒక్కస్తోత్రమైన నేర్చి, వీలయినప్పుడల్లా ఆస్తోత్రం చదువుకో. భక్తిగా నీకిష్టమైన రూపాన్ని ఒక్క నిమిషం పాటు నిలకడగా మనసులో తలచుకో. చాలు ఇంకేమీ అక్కరలేదు. అలా చేయలేనివాడు, ఆరుగంటలు మహాయాగం చేసినా ఫలితం లేదు. ఈమాట చాలమందికి నచ్చదు, కాని సత్యం. ఎవరికి వారు తమకు నచ్చినది చేసుకుంటూ పోతే నష్టం సంఘానికే. అంటే మనకే కదా! అట్లా ఎవరికి వారు తమకి

నచ్చింది, అనుకూలమైంది చేసుకుంటూ పోయారు. దాని ఫలితం....

న్యాయవ్యవస్థ దెబ్బతిన్నది. నిర్దోషి శిక్షింపబడుతున్నాడు. నేరస్థుడు నేర్పుతో తప్పించుకుంటున్నాడు. మనిషి పాపం చేయకపోవటానికి కారణం భయం. ఆ భయమే ఇతరులకు సుఖాన్నిస్తుంది. ఆపాపభీతి, న్యాయం చట్టం భీతి, లేక పోతే.... మనిషి జీవించలేడు.

ఇక అన్నిటికన్నా ముఖ్యమేమంటే 'డబ్బు' (ధనం)కి మనిషి ఇస్తున్న అపరిమితమైన ప్రాముఖ్యం. మనిషి బ్రతకాలంటే డబ్బు కావాలి. తప్పదు. కాని డబ్బుకోసమే మనిషి బ్రతుకరాదు. డబ్బుకాలీనం మనిషిని అన్ని వ్యసనాలకు బానిసను చేస్తుంది. నేరాలు చేయిస్తుంది. సత్యానికి ధర్మానికి న్యాయానికి మనిషిని దూరం చేస్తుంది.

బుద్ధ భగవానుడు చెప్పిన 'ధర్మం శరణం గచ్ఛామి' నవ్వుల పాలు చేశాడు, స్వార్థపరుడైన మానవుడు. బుద్ధుని ధర్మానికి వక్రభాష్యం చెప్పాడు ఆ దుర్మార్గుడు. సత్యంవద, ధర్మం చర, అహింసా పరమోధర్మః అనే దివ్య బోధలకు సత్యంవధ, ధర్మం చెర, హింసాపరమోధర్మః గా



మారిపోయాయి. దాని ఫలితంగా పవిత్రమైన బౌద్ధమతం నామమాత్రంగా మిగిలింది పవిత్ర భారతదేశంలో.

మనిషి చదువు'కొంటున్నాడు', పవిత్రమైన అన్నం అమ్ముకుంటున్నాడు, ప్రకృతి ఇచ్చిన నీటిని అమ్ముకుంటున్నాడు, జన్మనిచ్చిన స్త్రీని అమ్ముకుంటున్నాడు, జగద్రక్షకుడైన దేవుని దర్శనానికి టిక్కెట్లు పెట్టి అమ్ముకుంటున్నాడు, అన్నిటికన్నా ఘోరమేమంటే పసి పాపల్ని అమ్ముకుంటున్నాడు. భగవద్రూపులైన మహానుభావులు నెలకొల్పిన మతాన్ని కూడా అమ్ముకుంటున్నాడు. అయ్యలార! మనం మానవత్వం మరిచిపోతున్నాం.

నా బుద్ధికి ఏమితోస్తున్నదంటే బుద్ధభగవానుడు తిరిగి ఇంకొక్క సారి జన్మించాలి. మనిషి వేలం వెర్రిని, హింసా మార్గాన్ని, ధనవ్యామోహాన్నీ విడనాడి ధర్మమార్గాన్ని అహింసామార్గాన్నీ సత్య మార్గాన్నీ చేపట్టాలి.

కపిలవస్తు రాకుమారుడిగా ఆయన అవతరించడేమో కానీ "సంభవామియుగేయుగే" అని ఆయనే అన్నాడు కదా! మరిఎప్పుడొస్తాడో కాని, వస్తాడు.... తప్పక వస్తుడు.



## అంకితం

శా॥ ఘోరారణ్యమునందు జిక్కి తను
ఆక్రోశించి ప్రాణాలకై
పోరాడే ఒక జింకపిల్లనయితిన్
వల్లభా! శ్రీహరీ!
ఏరోజొచ్చునొ మృత్యువెచ్చుటవునో
ఈ భీతినే వీడితిన్
ఆరాధింతును 'బుద్ధ దేవు చరితన్'
అర్పింతు సంతృప్తితో



## 4. బుద్ధుని ముందు కాలంనాటి భారతదేశం

పురాణానికి చరిత్రకు బేధం ఉంటుందని అందరికీ తెలుసు. 'పురాణాలు నమ్మదగినవి కావు. అవి పుక్కిటి పురాణాలు' అనేవారు, చరిత్రకూడా అంతేనని గమనించాలి. బ్రిటిషు చరిత్రలో స్వాతంత్ర్య సమరం గురించి, నిజం ఉంటుందా? ఒక మతంవారు ఇంకొక మతం గురించి ప్రస్తావించేటప్పుడు రెండవ మతం గొప్పది అని పొగుడుతారా? అది నిజమైనా అవతలివాడు చెప్పేది నిజం నేను పొరబాటుపడ్డానని మనిషి ఒప్పుకుంటాడా? "తనమతమేదో... తనది, పరమతమసలే పడదోయ్" అన్నమాట నిజమేకదా!

5000 సంవత్సరాలక్రింద భారతయుద్ధం జరిగిందని చరిత్రకారులంటున్నారు. పాండవులు మునిమనుమడు జనమేజయుడు ఆదిగా, భారతచరిత్ర పురాణయుగం నుంచి

నవీన కలియుగంలోకి ప్రవేశించింది.

కాని రాజులు, చంద్రవంశం వారమని, కొందరూ, తమ పూర్వీకులు సూర్యవంశం వారని కొందరూ తమ పూర్వీకుడు శిశుపాలుడనీ, తమ చరిత్ర గొప్పదని కొందరూ చెప్పుకున్నారు. వారివలె తాముకూడా గొప్ప యాగాలు రాజసూయాలు చేస్తామని కులగురువులని కొంతమందిని నెత్తిన పెట్టుకుని వారు వేదోక్తమని చెప్పింది చేసి, యజ్ఞకాండ పెంచారు. భగవద్భక్తి స్థానంలో క్రతువులు బలులూ పెట్రేగిపోయాయి. రాజు విష్ణువు అంశ కలవాడని, అతను ఏం చేసినా ప్రజారక్షణకే కావున న్యాయమే ననే వాదన బలం పుంజుకుంది.

అది హింసకు దారితీసింది. ఏం జరిగినా అది తమ 'కర్మ' అనుకునే నైరాశ్యవాదం పెరిగి ప్రజలు అశాంతితో జీవిస్తూ అందులోనే సుఖం జుర్రుకోవటానికి ప్రయత్నిస్తూ బ్రతికేస్తున్నారు.

నలుగుర్ని తన్నగలిగినవాడు రాజయితే, నలుగురు



రాజుల్ని తన్నగలిగినవాడు చక్రవర్తి నలుగురు చక్రవర్తుల్ని తన్నగలిగినవాడు చరిత్రలో విశ్వవిజేత అనిపించుకున్నాడు. పరిపాలకుడంటే పదిమందిని చెప్పుచేతల్లో వుంచుకునే వాడనే విశ్వాసం బలపడింది. సైన్యబలంతో చిన్న చిన్నరాజులు కోకొల్లలుగా తయారయ్యారు. వారికి గురువులు, ఆస్థాన గాయకులు కవులూ నర్తకీ మణులు, ఉంపుడుకత్తెలు, చెలికాండ్రు, ఆస్థాన జ్యోతిష్కులు తయారయ్యారు. రేపు ఏం జరుగుతుందో తెలియక ఆ జ్యోతిష్యంపై విశ్వాసం పెరిగింది.

ఉ॥ పూనుచు యజ్ఞ దీక్షలను పొందగ స్వర్గ
నివాస యోగ్యతన్
మానక జంతుహింస, అసమానపు 'కీర్త' గు
నంచు ఈ భువిన్
మానవులంత ధర్మమును 'మాటల'
నిల్పుచు, సత్యదూరులై
వేనకు వేల పాపములు 'విప్రుల' మంచని
చేసి రక్కటా!



## 5. బుద్ధుని జననం బాల్యం వివాహం

హిమగిరి సానువుల్లో, మగధ సామ్రాజ్యానికి వాయువ్యదిశలో వర్ధిల్లిన చిన్న సామంత రాజ్యానికి రాజు శుద్ధోధనుడు. ఆయన రాజధాని కపిలవస్తు నగరం. ఆయన శాక్యవంశస్థుడు. వారి పూర్వీకులు ఇక్ష్వాకులని ప్రతీతి. రోహిణీ నదీతీరంలో టేకువృక్షాలతోను, సారవంతమైన సశ్యశ్యామల దేశాన్ని పాలించే రాజుకు సిరిసంపదలకి కొదవేముంటుంది? ఆ రాజుకు నలుగురు సోదరులు, ఇద్దరు సోదరీమణులు ఉన్నారు. ఆయన భార్య మాయాదేవి.

చాలాకాలం వరకు ఆమెకు సంతానం కలుగలేదు. శాక్యులు ప్రతిసంవత్సరం ఆషాడ సప్తమినుండి ఏడురోజుల పాటు వేసవి వీడ్కోలు పండుగలు జరుపుకుంటారు. పండుగ ఘనంగా జరిపిన మాయాదేవి విందు భోజనమారగించి బడలికతో నిద్ర కుపక్రమించింది.

తెల్లవారు ఝామున రాణి విచిత్రమైన కల కన్నది. ముత్యంవలె ప్రకాశిస్తున్న ఒక నక్షత్రం ఆకాశంనుండి ఆమె



ముందు వ్రాలింది. ఉన్నట్లుండి అది తెల్లని ఐరావతం (ఇంద్రుని వాహనమైన ఏనుగు) వలె మారిపోయి, ఆమె శయ్య చుట్టూ ముమ్మార్లు ప్రదక్షిణం జేసి, తనతొండం చివరగల తెల్లని తామరపువ్వుతో ఆమె నడుమును కోమలంగా నిమిరి సూక్ష్మ రూపం ధరించి ఆమె కుడిడొక్కలోంచి ఆమె ఉదరంలోకి ప్రవేశించింది.

నిద్రమేల్కొనిన రాణి శుద్ధోధనునికీ వార్త తెలిపింది. ఆయన ప్రముఖ జ్యోతిష్కులను పిలిపించి ఈ విషయం గురించి అడిగాడు. దానికి వారు 'రాజా! రాణి గర్భం ధరించి మీకు అంతులేని పేరు ప్రతిష్ఠలనందించగల కుమారుడిని అందించబోతున్నది. మీ వంశం కొన్నివేల సంవత్సరాలు కీర్తించబడేట్లు చేసే, ఆ కుమారుడు అజేయుడైన చక్రవర్తి అవుతాడు. లేదా జగద్విఖ్యాతుడైన సన్న్యాసి అయినా అవుతాడు. ఏ విధంగానైనా మీపేరు, చిరస్మరణీయ మవుతుంది అన్నారు. వారిని సత్కరించి పంపివేసిన శుద్ధోధనునికి తన చిరకాల వాంఛ తండ్రి అవటం నెరవేరుతున్నందుకు సంతోషాన్ని, తనకుమారుడు సన్న్యాసి

అవుతాడేమోననే విచారం మ్రింగేసింది. ఎలా? ఈ సమస్య ఎలా పరిష్కరించాలి? అని ఆయన సతమతమయ్యాడు. అప్పటికి కల నిజమవుతుందా చూద్దాంలే అని సరిపెట్టుకున్నాడు.

కానున్నది కాక మానదన్నట్లు, మాయాదేవి గర్భవతయింది. నెలలు నిండిన రాణిని వారి ఆచారం ప్రకారం పుట్టింటికి పంపుతున్నారు. ఆరోజు వైశాఖ పూర్ణిమ మంగళవారం. కపిలవస్తుకు ఇరవై మైళ్ళదూరంలో వున్న 'లుంబినీ' ఉద్యానవనం చేరే సరికే రాణి విపరీతంగా అలిసిపోయింది. బడలిక తీర్చుకోవటానికి ఒక సాలవృక్ష ఛాయలో చేరింది రాణి. ఉన్నట్లుండి పురుటి నొప్పులు ప్రారంభమైనాయి. కొంత సేపటికి లోకోద్ధరణకు అవతరించిన బుద్ధ భగవానుని జననం జరిగింది. అది క్రీ.పూ. 563. వారు అటునుంచే తిరుగు ప్రయాణం కట్టి కపిలవస్తు చేరారు.

పుత్రోదయ సందర్భంగా రాజు గొప్ప విందు ఏర్పాటు చేశాడు. ఐదవరోజు పురిటి స్నానం చేయించి బాలునికి 'సిద్ధార్థుడు' అని నామకరణం చేశారు. అన్ని అభీష్టములు



నెరవేర్చువాడని ఆ మాటకర్థం. సర్వార్థ సిద్ధికి అవతరించిన సిద్ధార్థుని చూడటానికి దేశం నలుమూలలనుండి ఎందరో మహాత్ములు వచ్చారు. హిమాలయాలనుంచి 'ఆసిత' మహర్షి వచ్చారు. ఆయన వయోవృద్ధుడు. బాలుని చూచి పరమానంద భరితుడైన, ఆయన 'ఇతడు లోక రక్షకుడు'. తన ముప్పది రెండవ ఏట దివ్య జ్ఞాన ప్రాప్తిచే అష్ట సిద్ధులు గల మహోన్నత పురుషుడవుతాడు. ఇతడు గగనతలం నుంచి మానవులకు దివ్యబోధ చేయుటకై వచ్చిన 'తథాగతుడు', అని విచారంగా మౌనం వహించాడు. కంగారు పడిన రాజు ఆ మౌనానికి కారణమేమని అడిగాడు.

**కం॥ నాకా 'బుద్ధుని' జూచుట**
**చేకూరదు అంతదనుక జీవించనుగా**
**నూకలు లేవని ఇవ్విధి**
**నాకన్నుల నీరు గ్రమ్మె నరవర! వినుమా.**

ఆ తథాగతుని వీక్షించే భాగ్యం నాకు లేదు అని 'అసితుడు' వెడలిపోయాడు.



వెంటనే రాజు దేశంలోనే గొప్ప కీర్తి గడించిన ఏడుగురు పండితులను పిలిపించి సిద్ధార్థుడి జాతక చక్రంవేయమన్నాడు. వారు క్షుణ్ణంగా దానిని అధ్యయనం జేసి ఇలా అన్నారు. **ఓరాజా! మా ఊహకందినంతవరకు ఇతడు జగద్గురువు, కారణ జన్ముడు. ఇతని భవితం రెండు విధాలుగా జరుగవచ్చు. మొదటిది ఇతడు అవిక్రమ పరాక్రముడై విశ్వ విజేతయై సాటిలేని చక్రవర్తి అనిపించుకుంటాడు. రెండవది ఇతడు ప్రపంచ ప్రసిద్ధమైన నూతన మతవైతాళికుడు కాగలడు. సన్యసించి ప్రపంచ శాంతిని పరిరక్షించుటకు నూతన మతమునావిష్కరించగలడు. రెండు విధములా తమరి పేరుకూడా గొప్పగా జనుల నోళ్ళలో నానుతుంది. ఈ మాటకు తిరుగులేదు** అన్నారు.

కౌండిన్యస గోత్రానికి చెందిన 'కొండన్న' అను పండితుడు **రాజా! వీరు చెప్పిన రెండవ విధానం జరుగవలెనంటే నాలుగు సంఘటనలు అతని మనసును కలచివేసి సంసారత్యాగానికి పురిగొల్పుతాయి. జాగ్రత్త** అని చెప్పాడు. రాజు ఒక దృఢ నిశ్చయానికొచ్చాడు. వీనికి వేదాంతం నీడ సోకనివ్వను.



నిత్యం సుఖాస్వాదనలో ముంచి తేలుస్తాను అనుకున్నాడు.

దురదృష్టవశాత్తు పురుటి అనారోగ్యంతో బాధపడి ఏడవరోజున రాణి మాయాదేవి కన్నుమూసింది. బాలుని సంరక్షణకు రాజు ఆమె సోదరి 'ప్రజాపతి గౌతమి'ని పెండ్లాడాడు. ఆమె చేతుల్లో అల్లారుముద్దుగా పెరిగిన సిద్దార్థుడు, గౌతముడని పిలువబడ్డాడు.

సిద్దార్థుడు, గౌతముడై సమవయస్సులైన తన పెత్తండ్రి కొడుకు 'మహానాముని'తోనూ, పినతండ్రి కొడుకు 'ఆనందుని'తోనూ మేనత్తకొడుకు 'దేవదత్తుని'తోనూ కలిసి ఒకేచోట పెరిగాడు. 'విశ్వామిత్రు'డనే గురువుదగ్గిర విద్యాభ్యాసం చేశారు వారు. ఏకసంతాగ్రాహియైన గౌతముడు గణితంలో ప్రతిభ కనబరచేవాడు. ఎనిమిదవ ఏటనుండి క్షాత్రవిద్యలైన కుస్తీ ఖడ్గవిద్యలు నేర్పారు. దేహధారుఢ్యం కలుగగానే 'భరద్వాజు'డనే యోగి వద్ద యోగవిద్యలు నేర్చి దానివల్ల అతనొక సుశిక్షితుడైన రాకుమారునిగా పరిణితి చెందాడు.

అతని హృదయం నిర్మలమై పూవువలె మృదువైనది. ఒకరోజు సిద్ధార్థుడు వనవిహారం చేస్తున్నాడు. ఉన్నట్లుండి అతనిముందు హృదయవిదారకంగా అరుస్తూ ఒక కొంగ ఆకాశంనుండి జారిపడింది.

ఆ॥ కుసుమ పేశలంబు, పసివాని హృదయంబు
గాయపడిన యట్టి క్రౌంచపక్షి
జూచి గౌతముండు జొప్పుంగ కన్నీరు
దాని జేతులందు గొనెను కావ.

దానిరక్తం తుడిచి, తన ఉత్తరీయం చించి కట్టుకట్టాడు. ఇంతలో రొప్పుతూ అక్కడికొచ్చిన దేవదత్తుడు ఆపక్షి తనదని వేటగానికే వేటాడిన జంతువు చెందుతుందని వాదించాడు. దేనిమీదనైనా రక్షించిన వానికే హక్కుగాని హంతకునికి కాదని వాదించాడు గౌతముడు. వివాదం రాజుగారి దాకా వెళ్ళింది. న్యాయకోవిదులంతా గౌతమునే సమర్ధించారు. కాబోయే రాజు గనుక వారు గౌతముని సమర్ధిస్తున్నారని గౌతమునిపై అకారణ ద్వేషం పూనాడు దేవదత్తుడు. ఆ తర్వాత పలు సంఘటనలలో



గౌతముని ఔన్నత్యం దేవదత్తుని స్వార్థం బయటపడి అతనిని గౌతముని ద్వేషిగా తయారు చేశాయి.

ఏతావాతా జరిగిన అసత్యప్రచారాల వల్ల అందగాడైన సుశిక్షితుడైన గౌతముని పెళ్ళాడుటకు రాకుమార్తెల తండ్రులెవరూ ముందుకు రాలేదు. చూస్తూ చూస్తూ సన్న్యసించబోయే వానికి పిల్లనిచ్చే తండ్రెవరు? అతను గొప్ప చక్రవర్తి అవుతాడనేది ఆశావాదమేకదా!

వివాహాలు స్వర్గంలో జరుగుతాయని నానుడి. అన్ని సంబంధాలు చూసిన రాజు తనకుమారునికి తన మంత్రి కుమార్తె నిచ్చి వివాహం చేశాడు. తన తెలివి తేటలతో భర్తని మార్చగలననుకున్నది 'యశోధర'. గౌతమునికోసం మూడు భవంతులు ప్రత్యేకంగా అన్నివసతులతో కట్టించారు. వాటికి శుభ, రమ్య, సురమ్య అని పేర్లు. ఒకటి రాకుమారుడు తన సహచరులతో గడుపుటకు. రెండవది బంధువులతో గడుపుటకు. మూడవది తన భార్య యశోధరతో గడుపుటకు. ఆ మూడు భవంతులను దాటి, అతడు అడుగు బైట పెట్టాల్సిన అవసరం లేకుండా చేశాడు. రాజు నలభై మంది నాట్య,



గాన, ప్రియ భాషణా విదుషీమణులైన అందగత్తెలు సిద్దార్థునికి అన్యమైన వాటి గురించి ఆలోచించ నవసరం లేకుండా చేశాడు రాజు. స్వర్గమంటే ఇదే అని వేరు ఆలోచన లేకుండా చేశాడు. ఆవిధంగా సిద్దార్థుని విరాగి కాకుండా ఆపగలననుకున్నాడు రాజు. కాని ఆయన అనుకున్నట్లు జరగలేదు.

భార్య ఆ మార్పు గమనించింది. ఆమె తెలివిగల యువతి. ఆమె తన భర్త చెరసాలలో ఉన్నవానివలె స్వాతంత్ర్యం కోరుకుంటున్నాడని అతన్ని నిర్బంధించి ఉంచడం తగదనుకుంది.

పైగా ఆమె గర్భవతి. తన సాంగత్యం నుంచి అతనికి ఒకింత స్వేచ్ఛనివ్వడం మంచిదని ఆమె తలంచింది. శుద్ధోధనుడు ఆమె చెప్పినదాని కంగీకరించి. నాలుగు శ్వేతాశ్వములను పూన్చిన చక్కని రథాన్ని అతనికోసం సిద్ధం చేయించాడు. దానికి సిద్దార్థుని చిన్ననాటి స్నేహితుడైన 'చెన్నుని' సారథిగా ఏర్పాటుచేసి, సుందర ప్రదేశాలే గౌతమునికి చూపించాలని మరీ మరీ చెప్పాడు.



## 6. మనో వైకల్యం, మహాభినిష్క్రమణ

ఒకరోజు సిద్దార్థుడు చెన్నుని నగరంలో విహారానికి తీసుకుని వెళ్ళమన్నాడు. దైవజ్ఞులు చెప్పిన సమయం వచ్చింది. రధానికి అడ్డంగా ఒక పండుముసలివాడు వచ్చాడు. ఏక్షణాన మరణిస్తాడో అన్నట్లున్న ఆ ముదుసలి నడకలో వణుకు స్పష్టంగా కనిపిస్తోంది. కళ్ళలో జీవంలేని ఆ దేహం నిండాముడతలు. ముగ్గుబుట్టలాంటితల. రధానికి అడ్డం వచ్చినందుకు చెన్నుడు అసహనంతో నిందిస్తున్నా మారుమాటలేక భయంతో వణికి పోతున్న అతన్ని చూసి గౌతమునికి ముందు ఆశ్చర్యం, తర్వాత ఆవేదన కలిగాయి. **ఏమిటిది? ఆరోగ్యంతో నిగనిగలాడుతున్న తనశరీరం కూడా ఒకనాడు అలా అయిపోతుందా! మరొక దారిలేదా? ఎంత దుర్భరం! మరి ఆవిధంగా మారిపోయే ఈ దేహం మీద మమకారం ఎందుకు? ఏమిటీ మాయ? చెన్నా దీని నివారణోపాయం ఏమిటి?** అని అడిగాడు గౌతముడు. **"ఇది భగవంతుని నిర్దేశం అందరికీ ఇదేగతి"** అన్నాడు చెన్నుడు. మనుష్యుల్ని ఇంత ఘోరంగా శిక్షించే ఆ దేవుడు అసలున్నాడా?

కొన్నాళ్ళ తర్వాత చెన్నుని మరల నగర పర్యటనకు తీసుకెళ్ళమన్నాడు గౌతముడు. ఈసారి ముదుసలి వారిని రాచరహదారిలో లేకుండ జాగ్రత్తపడ్డారు రాచపరివారం. ప్రకృతి ఆహ్లాదకరంగా ఉంది. ఎవరూ రధానికి అడ్డురావటం లేదు. ఇంతలో ఉన్నట్లుండి దారిలోనపోయే ఒక యువకుడు ఉన్నట్లుండి నరికిన చెట్టులాగ దారిలో పడిపోయి నోటిలో చొంగకారుస్తూ కట్టెలా బిగిసిపోయి కాళ్ళు చేతులు నేలకు కొట్టుకుంటూ బాధపడుతున్నాడు.

జనం అంతా మూగారు. ఏదన్నా ఇనుప వస్తువు అతని చేతిలో పెట్టండి. నాలుగు కడవల నీరు అతని నెత్తిన ఒంటిమీద గుమ్మరించండి. కాళ్ళు చేతులు నొక్కిపట్టండి, జనం అరస్తూ ఆయాపనులు చేస్తున్నారు. గౌతమునికి భయం, ఆ తర్వాత దుఃఖం కలిగాయి. ఏమిటిది? అందరికీ ఇంతేనా ఇలాంటి భయంకరమైన రోగాల పాలపడక తప్పదా? దీనికి నిష్కృతి లేదా? మనిషికీ దుఃఖం తప్పదా? దీనికి కారణమేమిటి? మనిషికి దుఃఖం తప్పదా?



ఇదంతా చూసి శుద్ధోధనుడు మిక్కిలి వేదనకు గురైనాడు. సంగతెరిగిన యశోధర, సిద్దార్ధుని కౌగలించి శోకించింది. నిజంగా నేనేమవుతున్నానో నాకే తెలియటం లేదు యశోధరా! ఇంత దుఃఖభరితమైన ప్రపంచంలో కేవలం అధికారం ఉన్నవారు సుఖించి, దరిద్రులు దుఃఖించటానికి కారణమేమిటి? పోనీ ధనంకలవాడు ఆనందంగా ఉన్నాడా? అదీలేదే? వాడూ దుఃఖిస్తూనే వున్నాడు. మనం దైవం అనుకుంటున్నవారెవరూ ఈ దుఃఖాన్ని ఆపలేక పోతున్నారు కదా! ఇక ఈ గుళ్ళూ గోపురాలూ దేనికి? యజ్ఞయాగాలతో మనం తృప్తిపరచేది ఎవర్ని? ఎందుకు? నిరంతర దుఃఖభాజనమైన ఈలోకంలో ఆనందం ఎలా కలుగుతుంది? ఆమె పరిష్వంగంలో కూడా అతని మనస్సు పరిపరివిధాలుగా ఆలోచించ సాగింది. సంగీత సల్లాపాలు ఏమాత్రం రుచించటం లేదు.

ఇంతలో సిద్దార్ధుని పూర్తిగా విరాగిని చేయగల ఇంకొక సంఘటన జరిగింది. ఒకానొక గౌతముడు ఉన్నట్లుండి



**"చెన్నా! రథం సిద్ధం చేయి వాహ్యాళికెళదాం"** అన్నాడు. గౌతముని ఆజ్ఞకు ఎందుకనే ధైర్యం ఎవరికీ లేదు. తాపీగా రథం నగర వీధులలో పోతున్నది. అన్యమనస్కంగానే మాట్లాడుతున్నాడు గౌతముడు. ఉన్నట్లుండి ఒకవీధిలో పెద్దగా ఏడుపు వినిపించింది. ఎవరో యువకుడు మరణించాడు. వానికోసం వాని బంధు మిత్రులు ఏడుస్తున్నారు. వాని భార్య అందమైన యువతి. ఆమె దుఃఖం వర్ణనాతీతం.

**చం॥ నను విడిపోతివేల ఇకనాకు జగంబున**
**ఏమి దక్కెరా?**
**కనులకు జూపులేని నిను కన్న జనంబుల**
**నేమి సేతురా?**
**తన జనకుండు చచ్చెనని తాను ఎరుంగని**
**చిన్నపాపకున్**
**వినుమని జెప్ప జాలుదునె; వేదనదీర్తునె**
**నీదు చెల్లికిన్**

ఆ విధంగా రోదిస్తున్న ఆమెను, ఆమె బంధువులు ఓదార్చలేక పోతున్నారు. ఇంతవరకు ఇటువంటి దృశ్యం చూడని



సిద్దార్ధుడప్రతిభుడైనాడు. రథం కొంతదూరం పోయాక **చెన్నా! నాకు భయం కలుగుతున్నది. ఆమె ఎందువలన అంత పెద్దగా రోదిస్తున్నది? ఆ పడుకుని యున్న యువకునిపైబడి వారంతా ఎందుకు దుఃఖిస్తున్నారు? అని అడిగాడు. బలవంతంమీద చెన్నుడిలా అన్నాడు. ప్రభూ! "ఆ యువకుడు మరణించాడు. అతనిపైబడి పెద్దగా విలపిస్తున్న ఆయువతి అతని భార్య. అతనిక తిరిగి రాడని అంధులైన ఆతని తల్లిదండ్రులను వివాహం చేయవలసిన ఆతని సోదరిని, ముక్కుపచ్చలారని తమ పుత్రుని జూచి దిక్కు తెలియక ఆమె ఏడుస్తున్నది"** అన్నాడు. మరణం అంటే ఏమిటి? ఇంత దుఃఖం కలిగించే ఆ మరణం మనిషికి తప్పదా? రేపు నేనూ చచ్చిపోతానా? ఇంకా జన్మించని నా బిడ్డ దిక్కేమిటి? నా భార్యకూడా ఇలాగే రోదిస్తుందా? ఒక పాపడు పుట్టాడని ఆనందించాలా వాని తండ్రి మరణించాడని దుఃఖించాలా? మనిషికి ఈ వేదన తప్పదా? దీని నివారణోపాయం లేదా? మనిషి ఎప్పుడూ ఆనందంగా ఉండే మార్గం లేదా? ఈ విధంగా ప్రశ్నల వర్షం

కురిపిస్తున్న గౌతమునికి తనకు తెలిసిన విధంగా సహజమైన ఈ చావు పుట్టుకల గురించి విచారించ కూడదని రాజు అయ్యాక సిద్దార్ధుడు ఎన్నో యుద్ధాలు చేసి ఎందరినో చంపాల్సి ఉంటుందని, ఎందరో నేరస్థులకు మరణదండన విధించవలసి వస్తుందని, ఇది రాజులకు స్వధర్మమని. రేపు శుద్ధోధనుని తదనంతరం గౌతమునికి కూడా ఈ బాధ్యత తప్పదని ఎరిగించాడు చెన్నుడు.

నిరుత్తరుడై నిచ్చేష్టుడైనాడు గౌతముడు. మరి ఇంత హింస, దుర్మార్గం ఉండే ఈ రాజరికం ఎందుకు? తన ప్రజల దుఃఖాన్ని నివారించలేని రాజుకు వారిని దండించఏ అధికారం ఎక్కడిది? మనిషి ఎప్పుడూ ఆనందంగా ఉండే దారిలేదా? ఆరాత్రి సిద్దార్ధుని కంటికి కునుకు లేదు.

జరిగిన మూడు సంఘటనలు రాజుకి తెలుస్తూనే ఉన్నాయి. తను చూస్తూ ఏమీ చేయలేక పోతున్నాడు. విధి అంటే ఇదేనా? కావలా కట్టుదిట్టం చేయలేక పోతున్నాడెందుకు? చూస్తూ చూస్తూ కాపలా వారికి గౌతముని



రహస్యం చెప్పలేదు. తను ఆంతరంగికుడైన చెన్నుని నిర్బంధిస్తున్నాడా? చూస్తూ చూస్తూ చెన్నుని రాకుమారుని ఆజ్ఞను తిరస్కరించమని చెప్పలేదు. ఇటువంటి సంఘటన ఇకపై జరుగరాదని కఠినంగా మందలించాడు చెన్నుని. ఆపైన భారమంతా తనకెన్నడూ కనిపించని ఆ దేవునిపై వేసి నిర్లిప్తంగా ఉండిపోయాడాయన.

సిద్దార్ధుని జీవితం నాలుగు సంచలన సంఘటనలు జరుగుతాయని దాని ఫలితంగా అతను సన్యసిస్తాడని జ్యోతిష్కులు చెప్పారు. ఆ నాలుగో సంఘటన ఏమయి ఉంటుంది? మరణం కంటే మనిషిని కలత పెట్టేది ఏమిటి? మంత్రి కుమార్తె అయినందువల్ల యశోధర పురిటికి ఎక్కడికీ వెళ్ళలేదు. నేడోరేపో ఆమె ప్రసవిస్తుంది. శుద్ధోధనుడు ఆ హడావిడిలో ఉండిపోయాడు.

ఒకరోజు గౌతముడు చెన్నుని రథం సిద్ధం చెయ్యి నగరం చూసి వద్దామన్నాడు. గుండె గుభేలుమంది. శుద్ధోధనునికి చెప్పే సమయం కూడా లేదు. అక్కడికీ నగరంలో భటులపై



తనకున్న ప్రత్యేక అధికారంతో ఇదివరకు సంఘటనలు పునరావృతం కాకుండా జాగ్రత్తపడ్డాడు. నెమ్మదిగా రథం పురవీధులలో ప్రయాణిస్తోంది. వారి రథానికి ఈసారి దివ్య తేజస్సుతో ప్రశాంతమైన కరుణాదృష్టికల ఒక పరివ్రాజకుడు (సన్న్యాసి) ఎదురుపడ్డాడు. ఈ ప్రపంచమే పట్టనట్లు చిదానందంలో ఉన్నాడా యోగి. కనురెప్పలార్పక అతనినే చూస్తుండిపోయాడు గౌతముడు.

**సీ॥ కాషాయ వస్త్రంబు గట్టిన ఆ యోగి**
**కనులు ప్రశాంతితో కాననయ్యె**
**శిరసు ముండనమయ్యె చేత భిక్షాపాత్ర**
**కఱ్ఱ ఇంకొక చేత కలిగియుండె**
**పాదరక్షలు లేవు పరివ్రాజకుడతండు**
**ఆసక్తియే లేక ఆతడుండె**
**సుఖదుఃఖములు రెండు జూపట్టె సమముగా**
**చిరునవ్వు పెదవిపై చెరగకుండె**



ఆ॥ వానిజూచినంత ఎనలేని సంతృప్తి
కలిగె గౌతమునికి, కనులు చెమరె
దృష్టి వాని నుంచి త్రిప్పలేకుండెను
అతడెవండొ తెలియనాశపడును.

**"చెన్నా! ఈ మహానుభావుడెవరు? ఇతని ఆకారం వింతగా వుంది. ఎందుకో నేనితనివల్ల సమ్మోహితుడనవుతున్నాను"** అన్నాను.

**"ప్రభూ!ఇతనొక సన్న్యాసి. సర్వసంగ పరిత్యాగి. భిక్షుక వృత్తితో జీవిస్తాడు. ధ్యానయోగం ద్వారా మోక్షప్రాప్తికి ప్రయత్నిస్తున్న విరాగి. నిత్యానందులని ఇటువంటివారినే అంటారు"** అన్నాడు చెన్నుడు. అప్రతిభుడై చూస్తుండిపోయాడు సిద్దార్ధుడు.

ఇంటికి తిరిగి వచ్చిన వారికి యశోధర చక్కని బాలుని ప్రసవించిందనే వార్త తెలిసింది. ఒక చెలికత్తె ఆ వార్త చెప్పగానే గౌతముడు విచార పడ్డాడు. తను సత్యాన్వేషణకు పోదామనుకుంటుంటే ఈ అవాంతరం ఏమిటి? అనుకుని

**'రాహువు' పుట్టాడా?** అని అన్నాడు. ఆ మాట ఆమెకు **రాహులు పుట్టాడా** అన్నట్లు వినిపించి పరిగెత్తుకుని రాజు దగ్గరకు వెళ్ళి గౌతముడు తన బిడ్డకు పేరు నిశ్చయించేశాడని బాబుపేరు రాహులుడని చెప్పింది. రాహులుడంటే ప్రేమించదగినవాడని అర్థం. ఆ పేరు విని అందరూ సంతోషించారు.

తన బిడ్డని చూడకుండానే అంత అందమైన పేరు పెట్టిన గౌతమునికి పుత్రవాత్సల్యం కలిగిందని ఆమె సంతోషించింది. ఆమెను చూడటానికి తప్పక వస్తానని అదివరకే వాగ్దానం చేసి ఉన్నాడతడు. తనీసంసార కూపంనుంచి బయట పడగలడా! తన తండ్రి తనని నిందిస్తాడేమో! అలా ఆలోచిస్తూనే ఒక విధమైన మత్తులోకి జారుకున్నాడు అతడు. ఏవేవో కలలు. యశోధర తనని బ్రతిమాలుతున్నది. ప్రభూ! రాహులుని చూడండి, కళ్ళు తెరవండి అంటోంది. మాట తప్పుతారా అంటోంది. ఉలికిపడిలేచాడు గౌతముడు. అవును మాట నిలబెట్టుకోవాలి. గబగబా అడుగులేస్తూ యశోధర గదికి వెళ్ళాడు. అందరూ నిద్రపోతున్నారు, భయంకరమైన



నిశ్శబ్దం. పిల్లవానివైపు తిరిగి ఆ బాలుని వదనంపై తన చేతి నీడపడేట్లు పడుకునుంది యశోధర. ప్రపంచాన్ని గెలిచిన విశ్వ విజేతలా ఉంది ఆమె ముఖం. ఆమెని తాకాలని బలమైన కోరిక కలిగింది. ఆ కోరిక తనని భ్రష్టుడిని చేస్తుందని అతనికి తెలుసు. తల్లి బిడ్డల్ని ఆ ఒంటరి రాత్రికే వదిలేసి అతను భవంతి వెలుపలికొచ్చాడు.

ఆరోజు నగర విహారంలో కనిపించిన పరివ్రాజకుడు అతని నిర్మల వదనం కనులముందు మెరిసింది. తనకి కూడ ఆ ఆనందం కావాలి ఈ రాజ్యం గీజ్యం వద్దు. ఆ తర్వాత తిరిగి వస్తున్న తన రధానికి ఎదురు వచ్చిన ఆమె గుర్తుకు వచ్చింది. అవును ఆమెపేరు 'కిసాగౌతమి'. ఆమె ఒక క్షత్రియ కన్య. తన తల్లిదండ్రుల్ని భార్యని ఆశీర్వదించి ఆమె ఒక మాట అన్నది. నిర్వృత్తి అనేమాట వాడిందామె. ఆ మాట అతని హృదయాన్ని తాకింది. ఆ మాటకి అర్థం నిర్వాణం అని. ఇక ఆ తర్వాత అంతా ఆనందమే కదా. ఈ జీవితం వ్యర్థం అనేమాట నిజమా! తనకి సత్యం తెలియాలి. దుఃఖ



నివారణోపాయం కావాలి. మృత్యువుని జయించాలి. ఎలా ఎలా? తపస్సువల్ల సాధించవచ్చా? దానికి ఈ సంసారం అడ్డంకి. తనురాజ్యం వదిలి పోవాలి. తప్పదు. చెన్నుని పిలిచి తన వెంట రెండు మంచి గుర్రాలతో రమ్మన్నాడు. **ఈ వేళలోనా ప్రభూ** అనే అతనికి **అవును** అని ధృడంగా సమాధానమిచ్చాడు గౌతముడు. చెన్నుడు గౌతముని హృదయము నెరిగిన వాడు. ఇక ఆలస్యం చేయలేదు.

**కం॥ జరిగెడిది ఆపగలనని**
**ధరపతి శుద్ధోధనుండు తనుయత్నించెన్**
**కొరగాని యత్నమౌగద!**
**'చిరకాలపు కీర్తి గనెద' చెన్నుడు తలచెన్.**

గౌతముని గుర్రం పేరు 'కాంతక' దానిని అందంగా అలంకరించి దాని యజమాని ముందు పెట్టి **'ప్రభూ! రేపు నన్ను నీ బంధువులు నిందించవచ్చు. పోనిండు ఈ ప్రపంచానికి మీరు దుఃఖ విమోచన అనే మహద్భాగ్యాన్ని ఈయనున్నారు. జరుగబోయే ఆ మంచి ముందు నాకు**



**లభించే అపకీర్తి లెక్కలేనిది. మీరు మీ ప్రయత్నంలో కృతార్థులవ్వాలని కోరుకుంటున్నాను** అన్నాడు.

"చెన్నా! నీవు చెప్పింది అక్షర సత్యం. నాతోపాటు నగర సరిహద్దుల దాకా వచ్చి కాంతకను నీతోపాట వెనుకకు తీసికొనిపో" అన్నాడు.

గుర్రాలు నిశీధిని చీల్చుకుంటూ పరిగెడుతున్నాయి. శుద్ధోధనుని ముద్దుబిడ్డడయిన సిద్దార్థుడు ఈ విధంగా సర్వం పరిత్యజించి జ్ఞానాన్వేషణకై అడవులకు మరలి పోవుటను పండితులు ''మహాభి నిష్క్రమణం' అన్నారు. ఒక నవీనయుగానికి అవనిక లేచింది. కానీ ఆ రాత్రి దేశం గాధ నిద్రలో వుంది. ఒక సత్యాన్వేషి నిశీధిలోకి వెలుతురు కోసం పోతున్నాడు.

# 7. జ్ఞానోదయం

వెనక్కి తిరిగి వెళ్తున్న చెన్నునికి జరిగింది నిజమా లేక పీడకలా అనిపించింది. ఆ భయంకరమైన రాత్రి గౌతముని కపిలవస్తుకి లేకుండా చేసిన తను ఎంత దుర్మార్గుడు. ఎంత రాజద్రోహం చేశాడు! చిన్నారి రాహులినికి తండ్రి లేకుండా చేసిన తనని రాజ, యశోధరా క్షమిస్తారా? గౌతముని మాటలు చెవుల్లో మారు మ్రోగుతున్నాయి. నీవు నిమిత్తమాత్రుడివి చెన్నా! కాలం కరిగిన కొద్దీ శరీరానికి తగిలిన గాయాల వలెనే మనోవ్యాధి కూడా తగ్గుతుంది. నీవు నాతో వచ్చేస్తానంటున్నావు. ఎక్కడికి పోతున్నానో నాకే తెలియదు. ఎందుకు పోతున్నానో తెలుసు. ఈ విశ్వం దుఃఖ విముక్తి పొందటమే నాలక్ష్యం. అది సాధించాక తప్పక కపిలవస్తుకి వస్తాను. ఇది నా వాగ్దానం.

నీవు తిరిగి పోకపోతే నాన్నగారు ఏమైందో తెలియక బాధపడి నిన్ను నన్నూ నిందిస్తారు. మనం చేసే పని త్రికరణ శుద్ధిగా చేయాలి. సత్యం తెలియుటకు నేను చేస్తున్న ఈ పని



విశ్వ కళ్యాణం కోసమని నాన్నగారికి మరీ మరీ చెప్పు. నాకోసం నిర్మించబడ్డ ఆ మూడు మహా సౌధాలూ నాకు అగ్ని గోళాల్లా కనిపిస్తున్నాయి. భోజనం విషతుల్యంగా కనిపిస్తోంది. నేను సన్యాసి నవుతున్నది లోకాన్ని బంధ విముక్తం చేయటానికి. నన్నే బంధంలో తగులుకోమంటున్నావు. నీవు నిమిత్తమాత్రుడవు. రాజు నిన్ను నిందించడు. వెళ్ళి నీ కర్తవ్యం నెరవేర్చు.

మనుష్యులకంటే మృగాలు నయం. వాటి విశ్వాసం మనిషికుండదు. గౌతముని అశ్వం 'కాంతక' ఆ తరువాత తిండి మానేసి కొద్దిరోజులకు, చనిపోయింది.

గౌతముని మాదిరిగా ఎందరో జిజ్ఞాసువులు తపస్సు చేస్తూ బ్రహ్మానుభవం పొందాలని అరణ్యాలలో కొండగుహల్లో గడిపేవారు. వారిని శ్రమణులు అనేవారు. గౌతముడు కూడా ధర్మం, సదాచారం, శమదమాలతో కూడిన సాధన చతుష్టయాలను పాటించాడు.

'అనుప్రియ' అనే మామిడితోటలో స్థిరపడి, అది సాధనల కనువైన స్థలమని భావించాడు. వైశాలీ నగర



ప్రాంతంలో మరికొన్ని యోగసాధనలు తెలిసిన బ్రాహ్మణులున్నారని విని రాజగృహ (మగధ రాజ్య రాజధాని) బయలు దేరాడు.

రాజగృహ దగ్గరలో 'సరస్వతీ నది' ప్రవహిస్తోంది. ఆ నగరంలో భిక్షువుగా జీవిస్తూ నిస్సంగియై దివ్య తేజస్సుతో వెలిగిపోయే సిద్ధార్థుని గురించి కథలు కథలుగా చెప్పుకునే వారు. ఆయనకు భిక్షవేసి ధన్యులవ్వాలని గృహిణులంతా తలంచేవారు. ప్రజలు పళ్ళు ఆప్యాయంగా ఇచ్చేవారు. ఆ నోటా ఆనోటా ఆసంగతి బింబిసార చక్రవర్తి వరకు వచ్చింది. అతన్ని చూడ్డానికి ఆయన స్వయంగా బయలుదేరాడు. తీరాచూస్తే మౌనిలా తన ముందున్నది తన మిత్రుడైన శుద్ధోధనుని ఏకైక పుత్రుడు, సిద్ధార్థుడని తెలిసి ఆయన నోటమాటరాలేదు. చివరికి **'నాయనా సిద్ధార్థా! మీ తండ్రికి నీవు లేక లేక కలిగిన బిడ్డవు. పోనీ మీ నాన్నతో తగవులాడి ఇట్లా వచ్చావా?**



**ఉ॥ ఎందుకు రాజ్యమున్ విడిచి ఇత్తరి భిక్షుకు**
**డైతి వీవు? మా**
**ముందర పుట్టినావు కద! మోదముతో సగమిత్తు**
**రాజ్యమం**
**దరివోలె రాజ్యమును అద్భుత లీలను**
**ఏలరాదొకో!**
**విందుమె! రాచబిడ్డ తను వింతగ యోగము**
**నేర్వజూచుటన్?**

నామాట వినమని బింబిసారుడెంత చెప్పినా సిద్ధార్థుడు తనపట్టు విడువలేదు. **"మహారాజా! నన్ను మన్నించండి. సత్యాన్వేషణలో ఎన్నికష్టాలైనా పడతాను. ఆ సత్యం తెలిస్తే సర్వమానవాళికి కలిగే మంచి గురించి ఆలోచించండి. మిమ్మల్ని కాదంటున్నందుకు క్షమించండి"** అన్నాడు.

**సరే, నీ నిర్ణయాన్ని అంగీకరిస్తున్నాను. కాని నీవు సత్యం తెలుసుకున్నాక. మగధవాసులకు ఆ జ్ఞానం అందించి**

**మమ్మల్ని తరింపజేయాలి** అని బాస తీసుకుని బింబిసారుడు వెడలి పోయాడు.

సిద్దార్ధుడు పసిపాపగా ఉన్నప్పుడు అతను జగద్గురువవుతాడని జోస్యం చెప్పిన కౌండిన్యుడు తన నలుగురు శిష్యులు అశ్వజిత్తు, కాశ్యపుడు, మహానాముడు, భాద్రికుడు అను వారలతో సంచారం చేస్తూ గౌతముడు ఆ ప్రాంతంలో సన్యాసిగా జీవిస్తూ సత్యశోధనలో ఉన్నాడని తెలుసుకున్నారు. అతి ప్రయత్నంతో వారు ఎట్టకేలకు అతనిని కలిసి అతనితోబాటు యోగదీక్ష పొందాలని నిశ్చయించుకున్నారు.

ఇంద్రియాల్ని అదుపులో ఉంచుకోవాలంటే వాటిని శుష్కింప చేసుకోవాలని వారు చెప్పగా విని అలాగేచేసి ఎన్నో నియమాలు నిష్ఠలూ పాటించి లక్ష్య సిద్ధికలుగకపోగా నీరసించిపోయి అది సరైన మార్గం కాదని నిశ్చయించు కున్నాడు సిద్దార్థుడు.

అక్కడినుండి భృగుని ఆశ్రమం చేరుకుని అక్కడ ఆ బ్రాహ్మణులు చేసే యోగ సాధనలచే ఆకర్షింపబడి ఆయన



శిష్యునిగా ఎన్నో యోగ సాధనలు నేర్చుకున్నాడు. కానీ వారి తపస్సంతా స్వర్గ సాధనకని ఆ స్వర్గ భోగాలు తనకక్కరలేదని ఆ బ్రాహ్మణులను వదలివేశాడు.

ఆ తరువాత రాజర్షి 'వేగనుని' ఆశ్రమం చేరాడు. ఆయన గొప్ప 'హఠయోగి'. రాజయోగ సాధన ఆయనకిష్టం. వైరాగ్యం అవలంభించి ఆయన వద్ద అవి నేర్చుకుని కొన్నాళ్ళు 'కుండలినీయోగం' సాధన చేశాడు, గౌతముడు.

మనిషి రికామిగా కలలు కనేప్పుడు కలిగే భ్రాంతియే కుండలిని. ఆ శక్తి నిద్రాణమై యుంటుంది. తీవ్రమైన సాధన చేత దానిని మేల్కొలుపవచ్చును. మనలో ప్రవహించే ఆ క్రియాశక్తినే కుండలిని అంటారు. యోగులకు మాత్రమే 'సుషుమ్న' ద్వారం తెరుచుకొని యుంటుంది. కుండలిని ఊర్ధ్వముఖంగా ప్రయాణించేటప్పుడు అతీంద్రియ జ్ఞానం కలుగుతుంది. సిద్దార్థుడు ఆ యోగ సాధన చేశాడు. తరువాత యోగాలన్నింటిలో 'అష్టాంగయోగం' ఉన్నతమైనదని స్వానుభవంతో తెలుసుకున్నాడు. అవి ఎనిమిది రాజయోగాలు.



1. యమము : దేహేంద్రియాదులయందు వైరాగ్యం. అది 5 రకములు. అహింస, సత్యం, అస్తేయం, బ్రహ్మచర్యం, అపరిగ్రహం. దీనివల్ల చిత్తశుద్ధి కలుగుతుంది.
2. నియమము: సదా బ్రహ్మయందు ప్రీతితోనుండుట. ఇది కూడ 5 విధములు. శౌచము, సంతోషము, తపస్సు, స్వాధ్యాయము, ఈశ్వర ప్రణిధానము.
3. ఆసనం : స్థిరముగా, సుఖముగా, ఒకేవిధముగా, ఒకే స్థలంలో ఆసీనులై వుండుట.
4. ప్రాణాయామం: ప్రాణనాడులను శుద్ధిచేయు ప్రక్రియ. ఇది 3 విధములు. పూరకం అనగా ఒక మాత్ర కాలంలో శ్వాస పీల్చుట. కుంభకం అనగా నాలుగుమాత్రల కాలం ప్రాణవాయువు నిరోధించుట. రేచకం అనగా ఒక మాత్రకాలం శ్వాస విడిచి పెట్టుట.



5. ప్రత్యాహారం : చిత్తమును బాహ్య వ్యాపారములయందు పోనీయక, అంతర్ముఖం చేయుట.
6. ధారణ : చిత్తమును చలింపనీయక నిశ్చలముగా నుంచుట.
7. ధ్యానము : సత్య జ్ఞానానందమయమై సర్వసాక్షిగా వుండు పరబ్రహ్మమును ధ్యానించుట.
8. సమాధి : తలంపులను మనోనేత్రంలో కనిపించే సకల దృశ్యములను అధిగమించి తాను తానై కేవలం సాక్షీమాత్రంగా వుండుట.

సిద్దార్థుడు వాటిని నిష్ఠగా, శ్రద్ధగా ఆచరించాడు. దాని ఫలితంగా అతను చిక్కి శల్యమై పోయాడు. ఆ తరువాత అతను 'భార్గవుడు' అనే ముని వద్ద చేరి ఆయన సూచించిన సాధనలను అనుసరించాడు. అదికూడ సమ్మతం కాక 'అలారకలాము' అనే బ్రాహ్మణుని ఆశ్రయించాడు. ఆ యోగి మోక్షవాది. సాంఖ్య సిద్ధాంతం సూత్రాల ద్వారా ఆయన ప్రాణాయామం, సమాధి నేర్పాడు. సిద్దార్థుడు వాటిని తీవ్రంగా అభ్యసించాడు.

కొన్నాళ్ళ తరువాత ఆయన **"సిద్దార్థా! ఇంతకుమించి నేను నీకు నేర్పగలిగిందేమీ లేదు" అన్నాడు. గౌతముడు "స్వామీ మరి మృత్యువును నిరోధించటం ఎట్లా? "ముసలితనం రోగాలను మనిషి జయించలేడా?" అని అడిగాడు. దానికాయన ప్రపంచంలో జీవిత కాలం పొడిగించుకొనుట సాధ్యపడుతుంది కానీ మృత్యువును జయించుట అసంభవం. అది పునర్జన్మకు విరామ సమయం. చనిపోయినాడనే మాట అర్థం లేనిది. మరల పుట్టేవాడికి మరణమేమిటి? మరణమనే విరామంలో ఏమవుతుందో ఎవరికీ తెలియదు. ఆ స్థితిని మాటల్లో వర్ణించలేరు.**

ఆ సమాధానానికి అసంతృప్తితో వెనుదిరిగాడు సిద్దార్థుడు. కౌండిన్యుడాదిగాగల ఐదుగురు సిద్దార్థుని అనుసరించారు. ఆ తరువాత వారు "ఉద్దారక రామపుత్ర" అనే గురువు నాశ్రయించి **"మీతో దివ్య జీవనం గడుపుతూ యోగసాధన చేస్తాం, అనుమతివ్వండని"** అడిగారు. ఆయన ఆశ్రయంలో కర్మనాచరిస్తూ కూడ నిశ్చలంగా ప్రశాంతంగా ఉండుటయే 'సహజ సమాధి' అని నేర్చుకున్నారు. కాని ఆయన **"నాయనా**



**సిద్దార్థా! నువ్వు నా ఆశ్రమంలోనే ఉండి నా శిష్యులకు నువ్వు నేర్చుకున్న యోగ సమాధి నేర్పుతూ మాతోపాటు ఇక్కడే ఉండిపో** అంటే గౌతముడు అసంతృప్తుడై అక్కడనుంచి వెడలిపోయాడు.

ఆ ఐదుగురు 'ఉరువేల' అనే అందమైన ప్రదేశం చేరారు. అక్కడ 'నిరంజరా' అనే నది ప్రవహిస్తోంది. అక్కడ చేరాక ఇక ఇలా మూకుమ్మడిగా యోగసాధన వల్ల లాభం లేదని చిత్త శుద్ధితో ఏకాంతంగా తపస్సు చేయాలని అక్కడ ఉన్న పల్లెకు దగ్గిరగా ఆశ్రమం నిర్మించుకుని తీవ్రంగా యోగ సాధన చేశాడు గౌతముడు. క్రమక్రమంగా ఆహారం కూడ విసర్జించి ఆకులు అప్పుడప్పుడు కందమూలాలు తింటూ తపస్సు చేశాడు. మరీ పట్టుదల హెచ్చింది.

**తే॥ తనువు శుష్కించిపోయెను, కనులు కూడ**
**గుంటలాయెను, ముఖకాంతి గోలుపోయె**
**పూని తాన్ 'అఘోర' మను సాధనను యెంచి**
**మానివేసెను ఆహారమును అతండు.**



పంచవర్గీయులు తిరిగి అతని వద్ద చేరి శుశ్రూష చేయ నారంభించారు. హఠయోగంలో వాయుస్తంభన నవలంభించాడు గౌతముడు. ప్రాణాయామం, హఠయోగం చేశాడు.

ఆ విధంగా ఆరు సంవత్సరాలు సాధన చేసినప్పటికీ ఎటువంటి ఫలితము కనిపించలేదు. ఆఖరికి అతను ఒంటరిగానే మిగిలిపోయాడు. ఒకరోజు ఉన్నట్లుండి స్పృహతప్పి పడిపోయాడతను. ఒకపల్లెవాడు గౌతమునిపై జాలి కలిగి రక్షణ కల్పించి పళ్ళు పాలు ఇచ్చి ఆయనకు ఉపచారం చేశాడు.

అప్పటికి సిద్దార్థుడు దేహాన్ని శుష్కింప చేసుకుని పురాణాలలో వలె తపస్సు చేస్తే ఏ లాభము లేదనీ, మనస్సు నిగ్రహించడం, ఏకాగ్రచిత్తం ఉంటే చాలు, పురాణాలలో రాక్షసులవలె ఘోరతపస్సు అర్థంలేనిపని అని గ్రహించాడు. మనస్సు ఏకాగ్రత కుదరవలెనంటే శరీరారోగ్యం ముఖ్యం. శుష్కించిన దేహం మోక్ష సాధన చేయలేదు. ఇలా



నిశ్చయించుకుని అతడు తిరిగి భిక్షాటన ప్రారంభించి శరీరానికి వలసిన ఆహారం తీసుకొనటం మొదలు పెట్టాడు.

ఒక నర్తకి పాడిన ఒకపాట అతని తప్పు అతనికి తెలిపింది. "తీగలు ఎంతవరకు బిగించాలో అంత వరకే బిగిస్తే వీణ అద్భుతంగా పలుకుతుంది. ఇంకా ఇంకా బిగిస్తే పుటుక్కున తెగుతుంది. అతి సర్వత్ర వర్జయేత్ అని గదా పెద్దలు చెప్పారు". గౌతమునికి కనువిప్పయింది. కొన్నాళ్ళకి గౌతముడు పరిపూర్ణ ఆరోగ్యవంతుడయ్యాడు. అతని దేహం బంగారంవలె మెరిసిపోతున్నది.

ఒకనాడు గౌతముడు కౌండిన్యుడు అతని నలుగురు శిష్యులను కలిశాడు. వారు, గౌతముని అపార్థం చేసుకుని యోగ భ్రష్టుడయిన అతని నీడ కూడ తమకు తగలరాదని తిరస్కరించి దూరంగా వేరొకచోటికి పోయారు.

గౌతముడు నిరంజన నదీ తీరంలో ఒక రావిచెట్టుక్రింద ఆత్మనిష్టుడై కూర్చుని కన్నులు మూసుకొని ధ్యానంలో ఉన్నాడు. చూపరులకు ఆయన శిలా విగ్రహంవలె ఉన్నాడు. అక్కడనేగల

'సేనాని' అనే గ్రామాధికారి పేరుకూడా సేనాని. ఆయన కూతురిపేరు 'సుజాత'. గౌతముడు ఒక దేవతామూర్తి అని తలచిన ఆమె తనకి చక్కని బాబు పుడితే క్షీరాన్నం నైవేద్యం పెడతానని మొక్కుకుంది. కొన్నాళ్ళకు ఆమెకు సుఖ ప్రసవమై ఒక బాలుడు పుట్టాడు. మొక్కు తీర్చుకుంటూ సుజాత **స్వామీ! నీ మహిమ చూపావు ఈ క్షీరాన్నం స్వీకరించు"** అన్నది. మెల్లిగా కన్నులు తెరచిన గౌతముని చూచి ఆమె నివ్వెర పోయింది. ఆమె మొక్కు తీరుటకు గౌతముడు స్నానం చేసి శుచియై ఆమె నేవేద్యం స్వీకరించాడు. అతడు ఆ విధంగా నిరాహారియై ధ్యానంలో శిలవలె ఉచ్ఛ్వాస నిస్వాసములు లేక అప్పటికి 48 రోజుల నుంచి శిలవలె నున్నాడు.

ఆ తరువాత గౌతముడు మామూలుగా ప్రక్కనున్న పల్లెకు భిక్షాటనకు వెళ్ళేవాడు. సిద్ధార్థుడు ఆ తరువాత 'గయ' అను ప్రదేశానికి తన స్థలం మార్చాడు. మళ్ళీ గౌతముడు తను తిని కూర్చుండుట చేత జీవనయానం సాగుతున్నదే కాని తన సాధన తన గమ్యం చేర్చుట లేదని గ్రహించాడు. మరల కఠోర తపోదీక్ష పట్టి నిరాహారియై మళ్ళీ శుష్కించిపోవటం



మొదలు పెట్టాడు.

అయితే ఈసారి ఆ కఠోర తపోదీక్షలో 7 వారాల తరువాత అతనికి ఒక అద్భుత సత్యం తెలియ వచ్చింది. అతను ఇలా అనుకొన్నాడు.

కం॥ జ్ఞానము సిద్ధించవలెన్
నే నేర్వవలెన్ ఘనంపు నిజమనుకొనుటే,
మానని కలతై నింపును
ఈ నామనమందు 'శాంతి' ఇక కనుటెట్లొ?

వెంటనే అతని తప్పు అతనికి తెలిసి వచ్చింది. దుఃఖ నివారణోపాయం కనుగొనాలనే తీవ్రమైన ఆశ తన మనస్సును మలినం చేస్తున్నది. మనశ్శాంతి కోరుకునే వాళ్ళు మొదట చేయాల్సిన పని కోర్కెని విడిచి పెట్టడం. అది చేయకుండా శాంతి ఎలా లభిస్తుంది? అంటే అశాంతికి దుఃఖానికి కారణం కోరిక. తీవ్రమైన అశాంతి రోగానికి, తీవ్రమైన రోగం



మృత్యువుకి కారణం అవుతాయి. కాబట్టి నిష్కామ, నిస్సంగ, నిర్మల జీవనమే దుఃఖ రహితమైన స్థితిని కలుగజేస్తుంది. వాడే జీవన్ముక్తుడౌతాడు. మృత్యుభయ నివారణమే మృత్యు నివారణము.

ఈ ఆలోచన తట్టిన తరువాత అతను ప్రశాంత చిత్తుడై, నిర్మోహియై, వాంఛా రహితుడై ధ్యానంలో కూర్చుండి పోయాడు. అతనికేవిచారమూ లేదు. ఆ రాత్రి అతను ప్రశాంతంగా పసిపాపలా నిద్రించాడు. నిర్మల హృదయంతో నిస్సంకోచంతో ధ్యానంలో ఉన్నవారికి భగవత్ స్వరూపమైన పరమానందం తప్పక లభిస్తుంది. **( ఈ 2008 సంవత్సరంలో కూడ ఈ మాట నిజమని ఎందరో జ్ఞాన యోగ సాధకులు చెబుతున్నారు. వారికి భగవంతుడు కిరీటమూ నాలుగు చేతులూ ఆయుధాలతో కనిపించడు. ఒక వెలుగులాగ కనిపిస్తాడు. ఆ తరువాత వారు పసిపాపలవలె ఆనందంగా వుంటారు.)** గౌతమునికి లభించిన దివ్య దర్శనం భగవంతుడు జ్యోతి స్వరూపుడని మరొక్కమారు నిరూపిస్తోంది.



'గయ'లో ధ్యాన సమాధిలో ఉన్న గౌతమునికి దివ్య అనుభవం కలిగింది. అతడు జ్ఞాన సముపార్జనాయత్నం కూడా మానివేశాడు. ఆ రాత్రి మొదటి జామున సిద్ధార్థునికి గత జీవితం జ్ఞప్తికి వచ్చింది. దాని తర్వాత పూర్వజన్మ జ్ఞానం కలిగింది. ఆ విధంగా తనని తను తెలుసుకున్న జ్ఞానంతో ధ్యానం కొనసాగించాడు.

రెండవ జామున జనన మరణ రహస్యం తెలిసింది. అంటే స్ఫురించింది. దివ్య చక్షువును పొందాడతను. ధ్యానం కొనసాగింది.

మూడవ జామున దివ్యమైన కాంతి దర్శనమైంది. ప్రత్యక్ష సముత్పాద సత్యం గోచరమైంది. యోగులంతా కలదు కలండనెడి ఆ పరమాత్మ ఆ వెలుగే. గౌతముడు పరమాత్మ అనలేదు 'సత్యం' అన్నాడు. సత్యమే నారాయణుడని సత్యనారాయణ వ్రతకథ తెలుపుతున్నది. (ఆ దివ్య సత్యదర్శనం త్యాగరాజుకి శ్రీరాముడయితే, జ్ఞానదేవ్‌కి పాండురంగడు. శంకరాచార్యుల వారికి పరమశివుడు, రామకృష్ణ

పరమహంసకు కాళికాదేవి. తానీషాకు ఇద్దరు ధనుర్ధాలుగా గోచరమైంది.) ఆ రూపం మన భ్రమా? మనం ఎట్లా అనుకుంటే ఆ పరమాత్మ దర్శనం అట్లా అవుతుంది.

ఆ దివ్యజ్యోతి అయ్యప్ప స్వామిగా టి.వి. కెమెరాకు గోచరమౌతుంటే అదంతా మోసం అనుకునే నేటి 'జ్ఞానుల'కి కూడా నమస్కారమే. అనుభవాన్ని ఎవరైనా నిరూపించగలరా? సత్య జ్యోతిని దర్శించిన గౌతముడు తన్మయత్వంలో ధ్యానం కొనసాగించాడు.

నాలుగవ జామున ఉదయ తార పొడచూపేవేళ సిద్ధార్థుడు కళ్ళు తెరిచాడు. అద్భుతమైన ఎప్పుడూ అనుభవం కాని దేదీప్యమైన కాంతి కన్నులకు గోచరించింది. మూడవ జామున అతను దర్శించింది జ్ఞాననేత్రంతో ధ్యానంలో. కాని ఇప్పుడు చూస్తున్నది మానవ నేత్రాలతో. గౌతమునికి ఆ దివ్యకాంతి దర్శనంతో అసాధారణమైన అనుభవం కలిగింది. ఆ దివ్యకాంతి క్రమంగా ఉదయతారతో పాటు అదృశ్యమై పగటి వెలుగులా మారిపోయింది. అతను పవిత్రమైన పూర్ణుడుగా



మిగిలిపోయాడు. బోధివృక్షం క్రింద ఆ దివ్యానుభవం పొందిన సిద్ధార్థుడు బుద్ధుడుగా అవతరించాడు. అసలింతకీ బుద్ధుడు కనుగొన్న సత్యమేది? **"అసలు ఏది ఉన్నదో అదే ఉన్నది".** పరమ సత్యం అదే. పరమజ్ఞానం అదే. (ఆది శంకరాచార్యులు ఇదే చెప్పి మిగిలినవన్నీ మిథ్య అన్నారు. కానీ బుద్ధుడు ఎదురుగా కనిపిస్తున్నదే సత్యం అన్నాడు. ఇది సిద్ధాంతపరమైన భేదం. ఈ భేదం బుద్ధుణ్ణి పరమాత్మనుంచి వేరు చేయలేదు. హిందూమతం ఆయనని పరమాత్మ శ్రీమన్నారాయణుని అవతారంగానే గుర్తించింది) నాలాంటి నారాయణుని నమ్మిన వారికి బుద్ధుడు భగవానుడే కాదు, శ్రీమన్నారాయణుని కలియుగ ధర్మమూర్తి. ఇంతకంటే ఇంకొక మంచిమాట చెప్పాలంటే **నమ్మిన వారికి శివలింగం, నమ్మని వారికి నల్లరాయి.**



**మ॥ కనియెన్ గౌతముడంత ముక్తి పథమున్**
**కష్టాలు తానోరుచున్**
**మునిలోకంబున శ్రేష్ఠులైన ధృతితో**
**మున్గాంచరాయెన్ భళా!**
**తను ఆ రీతిని బుద్ధుడాయె వెలయన్**
**ధాత్రిన్ సుసంపన్నమై**
**ఎనలేనంతగ శాంతి ధర్మములు, తామీ**
**లోక సంరక్షకై.**

ఆ విధంగా నిర్మోహియైన గౌతమునికి దివ్యజ్ఞానం అబ్బింది. ఆయన నిర్మోహి రాగబంధ విముక్తుడు. కామ, క్రోధ, మోహ, లోభ, మద, మాత్సర్యాలని అరిషడ్వర్గాలంటారు. వాటికి అధిపతియైన 'మారుడు' సిద్ధార్థుని నిర్మోహిగా ఒప్పుకొనక వాటిని ఆయనపై ప్రయోగించాడు. బుద్ధుడు వాటికి లొంగలేదు. ఆవేశంతో కుతకుతలాడిపోయిన 'మారుడు' అయిష్టం, మోసం,



అవివేకం, కీర్తిదాహం, ఆకలి దప్పులు, పిరికితనం, సోమరితనం, అనుమానం అనే తన బలగాన్ని పంపించాడు. అవి గౌతముని ఏమీ చేయలేకపోయాయి. 'మారుడు' కోపంతో రగిలి ప్రకృతిలో తన పరిచారకులైన సుడిగాలి, తుఫాను, ఉప్పెన, భూకంపాలను పంపి వాటి ప్రచండం గౌతమునికి రుచి చూపించాడు. గౌతముడు తొణకలేదు, బెణకలేదు.

ఇక ఇట్లాకాదని 'మారుడు' గౌతముని అసహ్యకరంగా నానాదుర్భాషలాడాడు. కన్ను తెరువలేదు గౌతముడు. ఇంక ఇలా కాదని అతడు **"ఓయీ గౌతమా! నీవు మౌనివే, కానీ, నీ శక్తి సామర్థ్యాలు నాకు కాస్త చూపించు"** అన్నాడు. గౌతముడు నిరాసక్తంగా నెమ్మదిగా భూమిని చరిచాడు. పిడుగు పడినట్లు పెద్ద ధ్వనితో భూమి కంపించింది.

'మారుని'కి ఉక్రోషం హెచ్చింది. తన కుమార్తెలైన ఆహ్లాద, ఆనంద, తృష్ణ, వాంఛలను పంపించి గౌతముని వశపరచుకోండి అన్నాడు. ప్రయోజనం లేకపోయింది. మారుడు బ్రతిమిలాడు తున్నట్లుగా **"నామాట విను గౌతమా,**

**నువ్వు అసాధ్యుడవే ఒప్పుకుంటాను నిన్ను ప్రపంచాధిపతిని చేస్తాను నువ్వు నామాట వింటూవుంటే చాలు"** అన్నాడు. గౌతముడు లొంగలేదు.

చివరి ప్రయత్నంగా ఒక గొప్ప మదపుటేనుగతో గౌతముని తొక్కించాలని చూశాడు మారుడు. ఆ ఏనుగు గౌతముని ముందు భక్తితో మోకరిల్లింది. చివరకు మారుడు తన ఓటమినంగీకరించి గౌతముని విజయం అంగీకరించాడు. అంటే సిద్ధార్థుడు వాసనా వృత్తులను జయించి భ్రాంతి, అవిధ్యను గెలిచి భావోద్వేగాలను అణిచాడన్నమాట.అదే మారునిపై విజయం.

బోధి వృక్షం క్రింద జ్ఞానం పొందిన సిద్ధార్థుడు బుద్ధుడు అయ్యాడు. బుద్ధుడు కాగోరు వారందరినీ 'బోధిసత్వులు' అంటారు. వారు పది జీవన దశలు దాటవలసి వుంటుంది. 1. అంతర్మాలిన్య శుద్ధి 2. ప్రజాక్షేమాన్నే కోరుకొనుట 3. పరిశుభ్రత, కామవాంచా నిర్మూలన. 4. దయ కలిగియుండుట. 5. నిర్దుష్టమైన మేధస్సు కలిగియుండుట.



6. వివేక జ్ఞానం కలిగి యుండుట. 7. అభిముఖుడై అనంత విశ్వాన్ని దర్శించ గలుగుట. 8. ఏ పరిస్థితిలోను సాధన నాపకుండుట. 9. నిశ్చలుడై యుండుట. 10. సాధుమతి అగుట.

ఈ పది లక్షణములు గల వారికి అనంతమైన దివ్యదృష్టి కలుగుతుంది. వారిని బోధిసత్వుడు అంటారు. ఆ విధంగా ఆనాడు కపిలవస్తు రాచబిడ్డ సిద్ధార్థుడు గౌతముడై బుద్ధుడయ్యాడు. అతనికే గాదు బోధిసత్వులయిన ఎవరినైనా 'బుద్ధుడు' అనే అంటారు. అరిషడ్వర్గములను జయించిన ఆ బోధిసత్వులు దివ్య జ్ఞాన బోధకు అర్హులు.

'నికాయ' అనే గ్రంథంలో బుద్ధుడు పొందిన ఆ నిర్వాణం గురించి వివరించారు. అక్కడ ఇలా వర్ణించారు. నిర్వాణం – అజాతం, అనుత్తరం, అజరం, అవ్యాధిగ్రస్తం, అమృతం, అశోకం, అసంక్లిష్టం, గంభీరం, దుర్దర్శనం, దురనుబోధం, శాంతి రూపం – అని. ఇవి వివరించాలంటే ఈ గ్రంథం పరిధి ఈ రచయిత శక్తి చాలవు.



**ఆ॥ బోధి వృక్ష ఛాయలో ధన్యుడై తాను**
**జనులకందజేసె శాంతి, సుఖము**
**"బుద్ధదేవు" డంచు పొగడంగ లోకంబు**
**'మోక్ష' మార్గమిచ్చె మురియ జగతి.**

పరమ సుఖాత్మకమైన ప్రశాంత స్థితిని పొందిన గౌతముని 'తథాగతుడు' మహాపురుషుడు, సత్యనాముడు, భగవానుడు అని పిలిచారు. బుద్ధ భగవానుడు ఆ విధంగా అవతరించాడు. ఈ ప్రపంచంలో వైదిక కర్మ కాండతో మాత్రమే స్వర్గం గానీ మోక్షం గానీ సిద్ధిస్తుందని, జంతు బలులతో దేవతల్ని తృప్తి పరచి స్వర్గ సుఖాలు పొందాలనుకోవటం పాపమని, విశ్వశాంతి జ్యోతి వెలిగించాడు.



## 8. జ్ఞాన బోధ

తనకు కలిగిన దివ్యానుభూతి యొక్క ఆనందాన్ని అనుభవిస్తూ బుద్ధుడు ఆ బోధివృక్షం క్రింద ఏడు వారాలు ఈ క్రింది విధంగా గడిపాడు.

1. మొదటివారం బోధి వృక్షం క్రింద తనకు కలిగిన సత్యానుభూతిని స్మరిస్తూ గడిపాడు.
2. రెండవ వారం అక్కడినుంచి లేచి ప్రశాంతంగా ఆ పరిసరాలలో తిరుగాడుతూ గడిపాడు.
3. మూడవ వారం తను నిర్వాణ స్థితిని పొందటం గురించి ఆలోచిస్తూ కొంతసేపు పూర్వంలా కూర్చుని తర్వాత అటూ ఇటూ పచార్లు చేస్తూ గడిపాడు.
4. నాలుగవ వారం దగ్గరలో గల మండపంలో కూర్చుని ధర్మస్మరణతోనూ తరువాత సమీపంలోగల సాలవనంలో తిరుగుతూ గడిపాడు.
5. ఐదవ వారం **'ముచికుందుడు'** అనే నాగరాజు ఇంటిలో నిర్వాణ పథాన్ని ధ్యానిస్తూ గడిపాడు.

6. ఆరవ వారం కార్య కారణ సిద్ధాంతం గురించి యోచిస్తూ గడిపాడు.

7. ఏడవ వారం **'కిరపాలు'** అరణ్యంలో ఒక రాతిపై పడుకుని విమోచనా తన్మయానందంతో గడిపాడు. ఇలా 49 రోజులు గడిచాయి.

తరువాత బుద్ధునికి భుజించాలనే ఆలోచన కలిగింది. ఆయనకు తపస్యుడు, భల్లూకుడనే ఇద్దరు కళింగ దేశస్తులు (ఒరియావారు) కనిపించారు. వారు బుద్ధునికి దయతో పిండిజావ, పళ్ళు, పుట్టతేనె ఇచ్చారు. తిరిగి బోధి వృక్షం క్రింద కూర్చుని వారు కోరగా వారికి తన చతుత్సత్యాలు చెప్పాడు. వెను వెంటనే వారు బుద్ధుని శిష్యులైపోయారు. వారే ప్రప్రథమ బౌద్ధోపాసకులు. **బుద్ధం శరణం ధర్మం శరణం** అన్నారు. బుద్ధుడు నేర్పిన ధర్మాన్ని వారు తాము వెళ్ళిన చోట్లల్లో ప్రచారం చేశారు. మానవ జీవితం దుఃఖమయం. ప్రతి ఒక్కరూ ఏదో కారణంగా బాధ పడుతూనే వుంటారు. సుఖం కోసం అన్వేషణలో మానవుడు పొందేది శారీరక మానసిక అశాంతి మాత్రమే. కన్నీటిమయమైన జీవితానికి



కారణం జన్మ. అది పొందాక క్రమేణా రోగమూ, వృద్ధాప్యమూ మరణమూ అనుసరిస్తాయి. ఆశ, పగ, ద్వేషం, భ్రాంతి, అసూయ, ఆసక్తి, అయోమయం వల్ల జీవికి తప్పని రోగం వంటి పరిణామాలు మరింత వేగంగా, బలంగా విజృంభిస్తాయి. వీటివల్ల మరింత బంధనాల్లో చిక్కుకొనిపోయి సంతోష రూపంలో కనిపించే దుఃఖాన్ని దిగమింగుతూ బ్రతుకుతున్నాడు మనిషి. ఈ దుఃఖానికి కారణం తన కోర్కె. అదే దురాశగా పరిణమించి దుర్మార్గం చేయిస్తుంది. అది మళ్ళీ జన్మకు కారణమవుతున్నది. జన్మ మళ్ళీ బంధాన్ని సృష్టిస్తుంది. ఈ చక్రభ్రమణం నుంచి మానవుడు బైట పడలేకున్నాడు. అతనికి సుఖశాంతులు దూరమై పోతున్నాయి. ఒకవేళ అవి కలిగినా అవి పోతాయేమో అనే భయం నీడలా వెన్నంటే ఉంటుంది. ఆ ఆందోళన తిరిగి రోగాన్ని, దుఃఖాన్ని ఇస్తుంది. దీనికి ఆశ్చర్యపడవలసిన పనిలేదు. వివేకవంతులు జ్ఞాన జ్యోతితో మాత్రమే ఈ చీకటి గొందుల్లోంచి బయటకు రాగలరు.

జ్ఞాన సముపార్జనా కోర్కె ఐహికమైనది కాకపోవుటచే



స్వార్థం లేకుండుటచే, శాంతినే కలిగిస్తుంది. దుఃఖ నిరోధానికి చెప్పుకునే అష్టాంగ మార్గం ఎనిమిది రకాలు 1. సరియైన ఆలోచన. 2. సరియైన అవగాహన. 3. నిర్మల మానసం 4. సత్కర్మ 5. సరియైన ప్రయత్నం. 6. సద్వర్తనము 7. బుద్ధి సూక్ష్మము 8. ఏకాగ్రత అరిషడ్వార్గాలను జయించి, తన దేహాన్ని శుష్కింప జేయక, 'అతి'ని వదిలిపెట్టి ఇంద్రియ భోగాల్ని విసర్జించాలి.

అవన్నీ చంచలమైన మనస్సును నిరోధించటానికే. మనస్సును అంతర్ముఖం చేసిన వానికి మాత్రమే ద్వంద్వ భావాలు నశిస్తాయి.

యజ్ఞ యాగాల వల్ల కోర్కె పెరుగుతుందే కాని తరుగదు. కోర్కెతో చేసే దేనివల్లనైనా కామన సిద్ధించవచ్చును గాని మోక్షం లభించదు. మనకోర్కె నెరవేరటానికి అన్నెం పున్నెం ఎరుగని జంతువుల హింస ఏం న్యాయం? ఉన్నాడో లేడో తెలియని దైవం, ఒకవేళ ఉన్నా కనిపించని దైవం ప్రీతికోసం నోరులేని జీవాల హింస అన్యాయం. శీలం, సత్ప్రవర్తనా, ధ్యానం వలన దుఃఖరాహిత్యం కలిగి మోక్షం సిద్ధిస్తుంటే



హింసాత్మకమైన వైదిక కర్మల వల్ల ప్రయోజనమేమిటి? పురాణాలలో చెప్పే ధర్మ ప్రవర్తన నవలంభించక దైవం అనే ఒక సాకుతో హింస, అధర్మం చేస్తూ వేదం చెప్పింది అని సమర్ధించుకుంటూ చెడు ప్రోత్సహించటం ఏం న్యాయం?

శీలం ఉండే సన్మార్గులకు దైవంతో పనిలేదు. ధ్యాన మార్గం ద్వారా ముక్తి లభిస్తుంటే భక్తితో పనిలేదు.

బుద్ధుడు చెప్పినది శ్రద్ధగా విన్న 'తపస్యుడు', 'భల్లూకుడు' ఆయన శిష్యులవడమే కాక అక్కడి నుంచి వెడలిపోతూ బుద్ధిని జ్ఞాపకార్థం ఆయన తలవెంట్రుకలు ఒక పెట్టెలో పెట్టుకుని తీసుకు వెళ్ళారు. వారు అక్కడనుంచి సింహళం (నేటి శ్రీలంక) వెళ్ళి ఆ పెట్టెను ఒకచోట ఉంచి తమ వ్యాపారం చూచుకున్నారు. ఆ తర్వాత ఆ పెట్టె పెట్టిన చోటుకు **"గిరి హిందు విహారం"** అని పేరు వచ్చింది.

మరియొక సంఘటన బుద్ధుని మార్గాన్నే మార్చివేసింది. తను సాధించిన నిస్సంగ స్థితిలో కూడ అతనిలోని కరుణామయుడు ప్రపంచం తనకేమీ పట్టనట్లు ఊరుకోలేదు. మున్ను ముక్కు మూసుకుని మునులు తపస్సు చేసి మోక్షప్రాప్తికి

జీవితం వెచ్చించి సాధించారు. కాని, దానివల్ల కేవలం వారికి మాత్రమే మేలు జరిగింది. జగత్కళ్యాణం కోసమని వారు చేయించిన యజ్ఞాలు వృధాగా అన్యులకు శ్రమ, మూగ జంతువులకు ప్రాణహాని, తప్ప మరేమీ మిగల్చలేదు. ఆ యజ్ఞకాండ దివ్యజ్ఞానం కలిగించ గలదా! మానవులకు శాంతినీయ గలవా!

ఒకరోజు భిక్షకు వెళుతున్న 'తథాగతునికి' దీనంగా అరుస్తూ దిక్కు తెలియక పారిపోయి వచ్చి ప్రాణభీతితో అరుస్తున్న మేకపిల్ల కనిపించింది. దానిని చేతులలోకి తీసుకున్నాడు. ఇంతలో కొందరు మొరటు వ్యక్తులు అటు పరిగెత్తుకుంటూ వచ్చి **"స్వామీ! పారిపోయి వచ్చి ఇది మా ప్రాణాలు తీసినంత పని చేసింది. ఈ దేశం రాజుగారు ఇక్కడ గొప్ప యజ్ఞం చేస్తున్నారు. దీన్ని బలి ఈయాలంట. ఇదేమో పారిపోయి వచ్చేసింది. దీన్ని మంత్రించారంట ఇంకో మేక పనికి రాదంట. రాజుగారు కోపంతో చిందులు వేస్తున్నారు. బేగి ఇప్పించండి సామీ! అని వేడుకున్నారు.**

**"విచారించకండి నాయనా! నన్ను రాజువద్దకు**



**తీసుకెళ్ళండి నేను చెప్తాను** అని వారిని ఒప్పించి యాగశాల జేరుకున్నాడు బుద్ధుడు. దివ్యతేజస్సుతో ఒకవేళ యజ్ఞపురుషుడే మానవ రూపంలో వచ్చాడా అన్నట్లున్న బుద్ధుని జూచి సాష్టాంగ పడ్డాడు రాజు. ఆయనను లేవదీసి **"రాజా! మన కోర్కెలు సాధించుకొనుటకు యజ్ఞయాగాల పేరున జీవహింస తగునా?**

**చం॥ దివి వరులెవ్వరైన తము దీనుల ప్రాణము**
**దీయ జూతురే!**
**ఎవనికి ప్రీతి కల్గు భళి! ఇత్తరి బూనుచు**
**మూగజీవులన్**
**అవధులు లేక వ్యర్ధముగ అంతము జేయుట**
**యజ్ఞకాండలో,**
**'చెవులలొ ఇల్లు కట్టుకొని' చెప్పెద**
**బుద్ధుని మాట నమ్ముడీ.**



**నువ్వు గొప్ప వివేకవంతుడివి. నిన్ను అనుసరించి నీరాజ్యంలో ఈ క్రతువులతో జీవహింసకు ఇతరులు కూడా పాలుపడుతున్నారు. ఒక జీవిని చంపి ఇంకొక జీవికి మేలు చేయటం పశున్యాయం అవుతుంది"** అన్నాడు. ఇది రాజులో పరివర్తన తెచ్చి అతను బుద్ధుని శరణు జొచ్చాడు. అప్పటిదాకా తన జ్ఞానం ఇతరులకు బోధిస్తే ఎవడు వింటాడు? ఏళ్ళ తరబడి వచ్చిన అలవాట్లు ఎవడు మానుకుంటాడు? బ్రాహ్మణులతోనూ తద్వారా అధికారులతోనూ ఎవరు వైరం తెచ్చుకుంటారు? అన్నిటికి దైవాన్ని బాధ్యుణ్ణి చేసి, భగవద్భక్తి పేరుతో సత్ప్రవర్తనే మరిచిపోయి, కర్మ సిద్ధాంతంతో కడజాతి వారిని కట్టి పడేస్తూ ఆనంద స్వరూపుడు మనలోనే గాని వేరొకచోట లేడని బోధించినా ఎవరు పరివర్తన చెందుతారు? ఇది తనను ధ్యాన విముఖుని చేసి ప్రపంచం సంగుడిని చేయదా? అనే ఆలోచనలలో ఉన్న బుద్ధుడు ఒక కృత నిశ్చయానికి వచ్చాడు.

తను ఈ బౌద్ధ ధర్మాన్ని దేశం నలుమూలలా విస్తరింప జేయాలి. ఇది తన ఒక్కడివల్లా కాదు. తను బుద్ధ సంఘాలను



నెలకొల్పి నలుమూలలా తన మతం విస్తరింప చేయాలంటే దేశ దేశాల రాజుల ఆశ్రయం కావాలి. కొంతమంది సహచరులు కావాలి. వారు కూడా గొప్ప బోధకులయి ఉండాలి. ఎవరున్నారు? అందుకు తగిన వారెవరు? **అలారకలాముడు, ఉద్దారక రామపుత్ర** వంటి మహాత్ములు తనువు చాలించారు. సామాన్యులీ పని సాధించలేరు.

తనతోపాటు కొన్నాళ్ళు సాధన చేసిన కౌండిన్యుడు. అతని నలుగురు శిష్యులు ఈ కార్యం సాధించగలరు. కాని వారు తనపట్ల విముఖులై ఆ సమయానికి **'మృగదావనం'** (సారనాథ్) లో ఉన్నారని వినికిడి. ఆ ప్రదేశం చేరాలంటే ముందు కాశీనగరం చేరాలి. కానీ అది తనున్న చోటునుండి పన్నెండు యోజనాల దూరంలో వుంది. వెంటనే బయలుదేరాడు. దారిలో **'ఉపాక'** అనే అతను ఎదురై **మీరు మహాత్ముల్లా ఉన్నారు, మీ గురువెవరు** అని అడిగాడు. తనకు గురువులెవరూ లేరని, తను తెలుసుకున్న సత్యాన్ని అతని కెరిగించాడు తథాగతుడు.

# 9. సారనాధ్‌లో భిక్షుక సంఘం

ఈ రచన ఇక్కడ వరకు ఒక కథలా సాగింది. ఇక్కడినుంచి కూడ అదే విధంగా సాగితే ఇది ఒక ఉద్గ్రంధంగా తయారయి తప్పటడుగులు వేస్తుంది. 2500 సంవత్సరాల క్రిందట జరిగిన చరిత్ర, అందులోనూ మూడువంతుల కాలం దాని విమర్శకులనే ఎదుర్కొన్న చరిత్రలో నిజాలు కాని, అసత్యములు కాని యధాతథంగా ఉండజాలవు. బుద్ధుడు నాస్తికుడనే విమర్శను ఎదుర్కొని మానవత్వం కంటే దైవత్వం ఏమంత ముఖ్యం కాదన్నాడు.

భూతదయలేని యజ్ఞకాండను నిరసించాడు. కాని దైవభక్తుల్ని సనాతన ధర్మాన్నీ నిందించలేదు. రాబోయే రోజుల్లో బుద్ధుడు 'దేవుడు', 'మహిమలు' గురించి చాలమంది విమర్శకుల్ని ఎదుర్కోవలసి వచ్చింది. ఆ వివరాలు వ్రాస్తూ పోతే ఈ పుస్తకం చాల పెద్దది అవుతుంది. బుద్ధ చరిత్రలో అతి ముఖ్యమైన సంఘటనలనే ప్రస్తావించడానికి ప్రయత్నిస్తాను. ముఖ్యమైన ఘట్టాలు నాదృష్టినుంచి తప్పించుకున్నా, చెప్పిన వాటిలో వైవిధ్యం ఉన్నా క్షంతవ్యుడను.



కాశీనగరానికి కాలినడకను బయలుదేరాడు బుద్ధుడు. అక్కడికి చేరాక అది చాలా పెద్ద పుణ్యక్షేత్రం అని గ్రహించాడు. కాశిలో మరణిస్తే శంకరుని సాయుజ్యం లభిస్తుందని ప్రతిహైందవుడూ నమ్మే శివక్షేత్రం అది. అక్కడ కౌండిన్యులవారి కోసం తీవ్రంగా గాలించాడు బుద్ధుడు.

అరవై రోజులు తిరిగి తిరిగి కాశీ సమీపంలోనె వున్న సారంగనాధ్ (నేటి సారనాధ్) బయలుదేరాడు. అక్కడికి దగ్గరలోనే వున్న 'ఇసీ పట్నంలో' 'మృగదావనం'లో ఆయన ఉన్నట్లు తెలుసుకుని అక్కడకు వెళ్ళాడు.

ఒకచోట దూరం నుంచే కౌండిన్యుల వారిని, ఆయన నలుగురు శిష్యుల్ని చూశాడు బుద్ధుడు. ఆరోగ్యంగా తేజస్సుతో నిగనిగలాడుతున్న బుద్ధుణ్ణి చూసి 'ఆహా! ఇతను యోగభ్రష్టుడయ్యాడు' అనుకున్నాడాయన. వారు తమకు తెలిసిన గౌతముడేమో అనుకుని మౌనంగా తిరస్కార భావంతో చూశారు కాని,



**ఆ॥ కనులు మెరయు కాంతి, కనులలోన ప్రశాంతి**
**దివ్యశక్తి కలుగు దివ్యుడనుచు**
**సాధుపుంగవునకు సాష్టాంగ పడిరంత**
**ఐదుగురును బుద్ధపదములందు.**

అర్ఘ్య పాద్యాలిచ్చి బుద్ధుని ఆదరిస్తున్నవేళ, కౌండిన్యులవారికి ఇతని భవిష్యత్తు తను చెప్పినట్లే జరిగిందని జ్ఞప్తికి వచ్చి సంభ్రమం కలిగింది. వారు బుద్ధుని **"మీరు ఉత్తమ మనుష్య ధర్మం పొందారా"** అని అడిగారు **"అవును నేను జ్ఞానం పొందాను. నా విముక్తి నిశ్చయం అయింది. ఆ విశుద్ధ జ్ఞానం తెలుసుకోకపోతే ఎవరికీ విముక్తి లభించదు", అన్నాడు బుద్ధుడు.**

ఆ తరువాత బుద్ధుడు పద్మాసనం వేసుకొని కూర్చొని కుడిచేతి చూపుడు మరియు బొటన వ్రేలు కలిపి ఉంగరంలా ఉంచి మిగిలిన మూడువేళ్ళు నిటారుగా ఉంచి ఉపదేశ ముద్రలో వారికి జ్ఞానబోధ మొదలు పెట్టాడు. **(ఈ సుదీర్ఘ ఉపన్యాసాలను ఇక్కడ ప్రస్తావించటం చాలా కష్టం. పాఠకులకు అందులో వ్రాసింది అర్థం చేసుకునేట్లు**



**వివరించడం నాబోటి సామాన్యుని వల్ల అయ్యేపనికాదు. ఒకవేళ వ్రాసినా అది అర్థమవడం చాలకష్టం. ఉదాహరణకి సత్పదార్థం అంటే నాలుగు వాక్యాలకంటే ఎక్కువ వ్రాయలేను. ఆ వాక్యాలు అసలు సంగతి వివరించలేవు. కనుక శ్రద్ధ ఉన్నవారు యూనివర్శిటీ లైబ్రరీలలో బౌద్ధ గ్రంధాలు తిరగేయాల్సిందే. తప్పదు)** ఆ సుదీర్ఘ ఉపన్యాసంలో బుద్ధుడు మానవుని దేహం గురించి, మానవుని ఊహాశక్తి గురించి, విజ్ఞానం అంటే ఏమిటి అనే దానిగురించి సత్పదార్థం గురించి, నిర్గుణ పరబ్రహ్మ తత్త్వం గురించి, దేహాలలోగల చైతన్యం గురించి, పంచ స్కంధాల గురించి వివరిస్తూ చాలాసేపు మాట్లాడాడు. అది విన్న ఆ పంచవర్గీయులకు తము కలగంటున్నామేమో అనిపించింది. తమకు తెలిసిన సిద్ధార్థుడు మితభాషి. ఇంత విజ్ఞానం ఇతనికెలా అబ్బిందా అని వాళ్ళు నోరు తెరిచారు, ఆశ్చర్యంతో.

మరునాడు తిరిగి తన ప్రసంగం మొదలు పెట్టాడు బుద్ధదేవుడు. ఆయన ఈ లోకానికి చెందని దివ్య అవతార పురుషుడేమో అనిపించింది ఆ పంచ వర్గీయులకి.

ఈ ప్రపంచంలో జన్మకలదేదైనా మరణించక తప్పదు. అన్నీ అశాశ్వతమే. జన్మవలన దుఃఖం, దుఃఖం వలన అజ్ఞానం అజ్ఞానం వలన జన్మ కలుగుతుంటాయి. ఈ చక్రానికి అంతు లేదు. ఎందుకంటే ప్రతిదీ కార్య కారణ సంబంధం వల్లనే ఏర్పడుతుంది. మనకి నిజమైన కారణం తెలియనప్పుడు కారణం మనకి గోచరం కాని భగవంతుడనుకుంటాం. దానివల్ల నిజం తెలియక భయానికి గురి అవుతాం. అనంత చైతన్యం వల్ల సృష్టి జరుగుతున్నది. ఆ చైతన్యం రూపం, గుణం, కారణం, లేనిది. నిజానికి, మనిషి సుఖదుఃఖాలకి కారణం ఆలోచన, దాన్ని ఆవిర్భవింప చేసే మనస్సు, అది అన్ని రకములైన భ్రాంతులను కలిగించి ఉన్న వానిని లేనట్లూ, లేనిదానిని ఉన్నట్లూ తోపిస్తుంది.

ప్రసంగానంతరం అతను మామూలు సిద్ధార్థుడుగా మారినా వారు మాత్రం ఆయన్ని బుద్ధ భగవానుడనే భావంతోనే ఉన్నారు. మరునాడు సాయంత్రం వేళ ప్రసంగం ప్రారంభమైంది. మనస్సంటే అది ఆలోచనల గిడ్డంగి. మానవునిలో చైతన్యం ఉన్నంత వరకు ఆలోచనలు, వస్తూనే



ఉంటాయి. అది 'వరద' వచ్చిన నదిలాంటిది. 'నేను' అనే భావన కలిగించేది ఈ మనస్సు అజ్ఞాన కారణ భూతము, ఈ 'నేను' అనేదే. ఈ 'నేను' వల్ల కలిగే ఆలోచనలు, అగ్నికీలలవలె గణన శక్యం కాని వినాశకారులు. ఆ 'నేను' అనే భావన 'నాది'గా కోరిక కలుగచేస్తుంది. కోర్కె దుఃఖానికి, దుఃఖం రోగానికి, రోగం మరణానికి, మరణం తిరిగి జన్మకు కారణమవుతుంది. కోరికను జయించాలంటే సంగత్వం వదులుకోవాలి. అది వివేకం, ధ్యానం వలన మాత్రమే సాధ్యమవుతుంది. అది అన్ని బంధాలనుంచి విముక్తి కలిగిస్తుంది. బంధ విముక్తి శాంతిని, శాంతి పరమానందాన్ని కలిగిస్తాయి. ఇవి చెప్పినంత తేలిక విషయాలు కావు. స్వానుభవం వలన తెలుసుకోదగ్గ సంగతులు. మనం నివసించే ఈ ప్రపంచం వాస్తవమైనది కాదు. అలాగని అవాస్తవమైనదీ కాదు. వాస్తవంగా కనిపించే అవాస్తవం. ఈ కనిపించటం ఎవరికి? అన్నిటికీ కారణభూతమైన మనస్సుకి. ఇదంతా మాయలా కనిపించే వాస్తవం, వాస్తవంలా కనిపించే మాయ. ఈ ప్రపంచాన్ని మంచిదనిగాని చెడ్డదని గాని చెప్పలేం.



ఎందుకంటే రెండూ మనసులోంచి వచ్చినవే. ఆ విధంగా తన ప్రసంగాన్ని ముగించాడు బుద్ధుడు.

బుద్ధుడు మరునాడు తన ప్రసంగాన్ని జీవితంలో పురోగమనానికి అడ్డువచ్చే కోరిక అనే శత్రువు గురించి చెప్పాడు. దాని శక్తి సామర్ధ్యాలు ఎంతటివారినైనా బలహీన పరుస్తుంది. చిత్త సంక్షోభాన్ని కలుగజేస్తుంది. ఆ కోరికకు పునాది ఆలోచన. ఆలోచనల్ని నిరోధిస్తే కోరికను, జయించవచ్చు. అది అష్టాంగ మార్గం వలన సాధించవచ్చు. ఆ మార్గం చీకటిగదిలో దీపం వెలిగించడం వంటిది. వెలిగించిన దీపం వానికే కాక మరెందరికో మార్గదర్శకమవుతుంది. ధర్మాన్ని బోధిస్తుంది.

చతుత్సత్యాల ద్వారా సత్యాన్ని తెలుసుకోవాలి. మొదటిది దుఃఖరూపమైన ప్రపంచం. రెండవది దుఃఖ కారణం అయిన తృష్ణ. మోహరాగాదుల వల్ల అది బలపడుతుంది. మూడవది దుఃఖనిరోధకమైన శాంతి. అది తృష్ణని సమూలంగా అంతం చేయగలదు.

నాలుగవది చాల ముఖ్యమైన మధ్యేమార్గం. దానిలో



ఎనిమిది అంగాలున్నాయి. 1. సమ్యన్ దృష్టి 2. సమ్యక్ సంకలం (ఈ రెండూ ప్రజ్ఞా జ్ఞానానికి సంబంధించిన శిక్షణలు) 3. సమ్యక్ వచనం 4. సమ్యక్ కర్మ 5. సమ్యక్ జీవనం ( ఈ మూడూ నైతిక జీవనానికి, శీలానికి సంబంధించిన శిక్షణలు) 6. సమ్యక్ ప్రయత్నం 7. సమ్యక్ స్మృతి 8. సమ్యక్ సమాధి. (ఈ మూడు చిత్తము మానసిక శిక్షణలు).

సమ్యక్ అంటే చక్కని అని అర్ధం. ఇక నైతిక మానసిక శిక్షకు ఈ ఎనిమిదీ ఎంతో అవసరం. దురాశలేని వానికి ఎవరితోటి శత్రుత్వం ఉండదు. దొంగతనం, మోసం, ఘర్షణ, అన్యాయం, విమర్శ, పొగడ్త, ఉద్రేకం, నేరం, విజృంభణ, ద్వేషం ఉండవు. ఆసక్తిలేని వానికి సన్మార్గాన్ని వదలాల్సిన అవసరం రాదు. ఈ విధంగ ఆ రోజు తన ప్రసంగం ముగించాడు బుద్ధుడు.

మరునాడు సుదీర్ఘమైన ఉపన్యాసం చాల విజ్ఞాన దాయకంగా భావించేలా ఉన్నది. బుద్ధుడీవిధంగా బోధించాడు. మానవుని జీవితంలో 5 గోచరించే ప్రమాదాలూ,

5 గోచరించని ప్రమాదాలు ఎదురవుతుంటాయి. వానినుండి అతను సావధానుడై ఉండాలి. స్వార్థం, సందేహం, కామం, ద్వేషం, దొంగబుద్ధి – ఈఐదు పైకి కనబడే ప్రమాదాలు. జీవితంపై కాంక్ష, అహంకారం, గర్వం, వ్యాకులత, అవిద్య – ఈ ఐదు పైకి గోచరించని ప్రమాదాలు. మానవుడు వీటి నుంచి కడు సావధానుడై యుండాలి. జీవితంలో ఆహ్వానించదగ్గవి మరో 5 ఉన్నాయి. అవి 1. విశ్వాసం, 2. జాగృతి, 3. శక్తి, 4. మనసు భారరహితమై ఏ ఆలోచనలేని ధ్యానం, 5. జ్ఞానం.

జీవితాన్ని వాస్తవంగా చూడగలగాలి. మంచి ప్రయత్నం చేయాలి. శ్రద్ధతో కూడిన ఏకాగ్రత లేని ధ్యానం నిరుపయోగం. నీతివర్తనయందు ప్రేమ, నిశిత పరీక్ష, నమ్రత, విధేయత, పాపభీతి, శక్తి సామర్థ్యాలు కావాలి. పరిశుభ్రత పాటిస్తూ మితాహారం మాత్రమే తీసుకోవాలి. దేహం ఆరోగ్యంలో అశ్రద్ధ పనికి రాదు. విముక్తి పొందిన వారెవరంటే ఇహపరలోకాలలోని సుఖాలపై వాంఛలేనివారు. కామసుఖమే ముఖ్యమని తలచేవారు అదెంత హేయమైనదో గ్రహిస్తేగాని దుఃఖ విముక్తులు కాలేరు.



జీవితం ఏ విషయంలోనైనా 'అతి' ని విసర్జించాలి. సాధకులకు మధ్యేమార్గం ఎప్పుడూ లాభదాయకం. సాధకుడు పది సంకెళ్ళను ఛేదించుకోవాలి. అవి 1. అహాన్ని విడనాడవలెను. 2. ధర్మం విషయంలో సంశయం వదలవలెను. 3. కర్మాచరణంలో మూఢాచారం వలదు 4. విషయ వికారాలు తగవు. సాత్వికాహారం మాత్రమే తీసుకుంటూ బ్రహ్మచర్యం పాటిస్తేనే ఇది సాధ్యం. 5. సమత్వం ఉండాలి. 6. విషయ వాసనలలో అనాసక్తి ఉండాలి. 7. సుఖాపేక్ష తగదు 8. గర్వం పనికి రాదు 9. దంభం తగదు. 10. అజ్ఞానం అంతం కావాలి. ఈ పదింటిని 'భవచక్రము' అంటారు.

దీన్ని తప్పించుకున్నవారికి మాత్రమే మోక్షం సిద్ధిస్తుంది. శారీరకంగా కోర్కెను జయించి మానసికంగా 'అహం' ను విడనాడిన జీవన్ముక్తుడవుతాడు. మానవునిలో పది దోషాలుంటాయి. మూడు మనస్సుకు, మూడు దేహానికి, నాలుగు సాధనలో కలిగేవిగా ఆ పదిని విభజించారు.

1. అసూయ 2. సంశయం. 3. ఆగ్రహం – మనస్సు దోషాలు



4. హింస 5. వ్యభిచారం, 6. దొంగతనం – దేహం 7. అసత్యం 8. ఉబుసుపోక కబుర్లు 9. దూషణములు 10. అపనిందలు తగవు. ఈ పదీ నిర్వాణ పథంలో సాధకునికి అత్యంతావశక్యం.

నిర్వాణమంటే అఖండమైన ప్రజ్ఞ, 'ఉనికి' కలిగి యుండుట అని అర్థం. నిర్వాణ స్థితి చేరుకున్న వారికి చావు పుట్టుకల దుఃఖ, సంతోషాలుండవు.

ఆ విధంగా సారనాథ్‌లో బుద్ధుడు నాలుగు నెలలపాటు దివ్యజ్ఞాన బోధ చేశాడు. రోజుకి ఒక నూతన అంశం పాత సంశయమే అయినప్పటికీ తథాగతుని నోటినుండి వచ్చే దివ్య బోధ ఎప్పటికప్పుడు నూతనంగా ఏదో కొత్త విషయం తెలియపరుస్తు ఉంటుంది.

'అసితమహర్షి' శిష్యుడైన 'నాలకుడు' కూడా తన గురువు ఆజ్ఞ ప్రకారం సారనాథ్ వచ్చి బుద్ధుని ద్వారా ఎన్నో కొత్త విషయాలు తెలుసుకున్నాడు. మరునాడు తను సారనాథ్ విడిచి పోతాననగా ఆరోజు బుద్ధుడిచ్చిన ప్రసంగం శ్రోతలను మంత్రముగ్ధులను చేసింది. **"నన్ను నేను తెలుసుకున్నాను.**



**నా చిత్తవృత్తులన్నీ నిర్మూలింపబడ్డాయి. అరిషడ్వర్గాలను జయించగలిగాను. నిర్వాణ స్థితి పొంది కపిలవస్తు రాకుమారుడినైన నేను, ఆ 'నేను' అంటే ఏమిటో తెలుసుకుని బుద్ధుడినయ్యాను. నాలాగ సాధన చేస్తే మీరెవరైనా బుద్ధులు కావచ్చు. నేను తెలుసుకున్నదొక్కటే. దుఃఖాన్ని నివారించగలిగింది శాంతి మాత్రమే. శాంతిని కలిగించేది ధర్మం మాత్రమే. ధర్మానికి ఊపిరి సత్ప్రవర్తన. దానికి ఆధారం శీలం చెడుమీద మంచి గెలుస్తున్నంత వరకు శాంతి చిగురిస్తూనే ఉంటుంది. నాబోధ దుఃఖం ఉన్నంతకాలం మానవ కళ్యాణకారిగా ఉంటుంది.**

ఆ మాటలు శిష్యులకు తేనె ఊటలుగా తోచాయి. వారంతా ఒకసంఘంగా ఏర్పడ్డారు. వారి దీక్ష విశ్వశాంతికి కృషిచేయటం. వారిని చూసి బుద్ధభగవానుడు మొదటిసారిగా "ఓ భిక్షులారా!" అని సంభోదించాడు. అప్పటినుంచి ఆ సంఘం వారికి భిక్షువులనే పేరు నామకరణమైంది. గౌతమబుద్ధుడు మహా భిక్షు అని జగద్విఖ్యాతుడై భగవానుడని పిలువబడ్డాడు.

## 10. బౌద్ధ మత వ్యాప్తి

బుద్ధుడు 'కాశి'లో వుండగా 'యజుదు' అను ధనికవర్తకుడయిన యువకుడు బుద్ధుని దర్శించి, **'స్వామీ! కామ భోగంతో జీవితమంతా గడిపాను. ఈ సుఖం కన్నా మేలైనది ఏదన్నా ఉంటే నాకు ప్రసాదించండి"** అన్నాడు. ఆయన ధర్మోపదేశం విని ఆ యువకుడు చలించిపోయాడు. **"బ్రహ్మచర్యం పాటించక పోయినా ధర్మ బద్ధంగా ధనం సంపాదించకపోయినా ప్రజలు నశించి పోతారు. మురికి గుంటలో ఎంతసేపు స్నానం చేసినా ఉపయోగం ఉండదుకదా! నీ యవ్వనం పోయాక నీ శరీరం నీకే అసహ్యమేస్తుంది. కళ్ళు తెరచి జ్ఞానమార్గం తెలుసుకుంటే నీకేకాక నీలాంటి మరికొందర్ని మార్చగలవు"** అన్నాడు బుద్ధుడు.

యజుడు బౌద్ధ భిక్షుకుడయ్యాడు. అది విని అతని తల్లిదండ్రులూ భార్య ఆనందించారు. **ఇంటి ముఖం చూడకపోయినా సన్మార్గంలో 'జీవించి వున్న' తమ కుమారుడు**



**తమకు చాలు** 'అని వారు బుద్ధుని వేనోళ్ళ ప్రస్తుతించారు. బుద్ధుని ప్రార్థించి వారంతా బౌద్ధ సన్యాసులయ్యారు. ప్రప్రథమంగా భిక్షుకి సంఘం ఏర్పాటయింది. వారికి మరికొన్ని మార్గదర్శక నిబంధన లేర్పాటు చేశాడు బుద్ధుడు.

ఆయన కొత్తగా చేరేవారిని **'ఓ భిక్షు! రా'** అని ప్రేమగా పిలిచి దీక్ష ఇచ్చేవారు. సంఘ సభ్యుల్ని మీరంతా ఐకమత్యంగా ఉండాలి. ఒకరికొకరం సహాయం చేసుకోవాలి. నిర్మల హృదయంతో ధర్మమార్గంలో గడపాలి. కాషాయం కట్టాలి. ముండనం చేయించుకోవాలి. "బుద్ధం శరణం గచ్ఛామి – ధర్మం శరణం గచ్ఛామి – సంఘం శరణం గచ్ఛామి" అనే మంత్రాన్ని ముమ్మార్లు ఉచ్ఛరించాలి.

భిక్షువులకు హింస, అసత్యం, మద్యపానం, వ్యభిచారం ఎంత మాత్రం తగవు. మితాహారియై యుండాలి. బ్రహ్మచర్యం పాటించాలి. విలువైన వస్త్రధారణ, సుగంధ భరిత వస్తువులపై కాంక్ష, విలాస జీవనం నిషిద్ధం. సుఖశయ్యా శయనం, అనవసర ప్రసంగం "తలలు బోడులైన తలపులు బోడులా"



– అన్న రీతి సచ్ఛీలత మాటలలో కాక చేతలలో చూపాలి. ధ్యాన సమాధిలో చిత్తాన్ని నిరోధించాలి.

శాంత చిత్తుడు, ఏకాంత ప్రియుడు, సమదృష్టి, అష్ట విధములైన 'సమ్యక్' భావన, వజ్ర సంకల్పం, చిదానందంలో గడుపువాడు, భూతదయగలవాడు తన భిక్షలో ఒక భాగం పక్షులవంటి జీవరాసులకు పెట్టువాడు, త్రికరణ శుద్ధి గలవాడు మాత్రమే బుద్ధుడు అయేందుకు అర్హుడు. మిగతావారు కేవలం సన్యాసులుగానే మిగిలిపోతారు. కావున తీవ్రమైన సాధన జీవితాంతం కొనసాగాలి.

అనేకులు, స్త్రీ పురుషులని భేదం లేక ఆయన మార్గాన్నవలంభించారు. వారందరి గురించి ఇక్కడ ప్రస్తావిస్తే ఒక జీవిత కాలం చాలదు.

**కం॥ తరుణులు 'సంఘము' నందున**
**వరమది నిక్కముగనన్న భావన జేతన్**
**విరివిగ జేరిరి, భిక్షుకి**
**వరుసలు బౌద్ధమ్ము బూని బడసిరి 'శాంతిన్'.**



పురాణాలలో వలె తపశ్శక్తిచే దివ్యసిద్ధులు పొందాలి అనుకునేవారిని బుద్ధుడు సమ్మతించేవాడు కాదు. శక్తులు కావాలనుకోవటమే ఘోరమైన కోరిక. అసలు కోరికే కదా! దుఃఖకారణం. కాని ముఖ్య శిష్యులగురించి చెప్పక తప్పదు కదా. మగధరాజు బింబిసారుని కలిసి తను తెలుసుకున్న సత్యం తెలుపుతానని ఇదివరకు బుద్ధుడు మాట ఇచ్చాడు. అందుకని ఆయన మగధ బయలుదేరాడు.

మగధ రాజధాని 'రాజగృహ' దగ్గర రెండు బ్రాహ్మణ అగ్రహారాలున్నాయి. అందు ఉపతిశ్యం అనే దానిలో 'సారిపుత్రుడు' (సరస్వతీపుత్ర) తన ఒప్పంద ప్రకారం తను ముందుగా జ్ఞానం తెలుసుకుంటే అది తన మిత్రునికి చెబుతానన్నాడు. రాజగృహంలో అతను 'అశ్వజిత్' అనే బౌద్ధ భిక్షువును కలిశాడు. **స్వామి మీ ముఖం ఇంత దివ్యతేజంతో వెలిగిపోతున్నది. మీ గురువెవ్వరు** అని అడిగాడు అశ్వజిత్‌ని. కౌండిన్యులవారు అతని గురువు. వారినుంచి దీక్ష స్వీకరించాడు. తన మిత్రునితోపాటు ఆయననుంచి దీక్ష తీసుకున్న సారెపుత్రుడు. **స్వామీ నేను బుద్ధ దేవుని కలవాలి**

అని ఆత్రుతగా అడిగాడతను. బుద్ధుడు రాజగృహ సమీపంలోనే ఉన్నాడని తెలిసి ఇద్దరు మిత్రులు తమ దీక్షానంతరం బుద్ధుని కొరకు బయలుదేరారు. అతని మిత్రుని పేరు **'మగ్గల్లాన'.**

తమ ఒప్పందం ప్రకారం తను విన్న దివ్య జ్ఞానాన్ని తన మిత్రునికెరిగించి ఇద్దరూ 'బుద్ధ దర్శనానికి బయలు దేరారు. దారిలో వారు తమ పూర్వగురువైన సంజయుని కలిసి జరామరణాల కతీతమైన జ్ఞానం శాక్యముని ద్వారా పొందాలనుకుంటున్నామని చెప్పి, అతను నిరాకరించినా, వారు ధృడనిశ్చయులై బుద్ధుని దర్శించి, ఆయనకు సాష్టాంగపడ్డారు. వారిద్దరి మిత్రులయిన మరియొక రెండువందల యాభైమంది బ్రాహ్మణులు బుద్ధుని జ్ఞానం తెలుసుకుని తాముకూడా సంఘంలో చేరిపోయారు.

ఆ విధంగా తనవెంటచేరిన వెయ్యిమంది శిష్యులతో రాజగృహ చేరాడు బుద్ధుడు. వారంతా 'యష్టివనం' అనే చోట బసచేశారు. అది రాజగృహకు 24 కోసుల దూరంలో వుంది. ఆ బృందానికి నాయకుడు కౌండిన్యులవారు.



బుద్ధుని సందర్శనానికి వచ్చిన బింబిసారుడు తన రాజ్యంలోనే గొప్ప సనాతన ధర్మ నిష్టాగరిష్టుడని పేరు పొందిన బ్రాహ్మణ పండితుడు కౌండిన్యులవారిని అక్కడ చూసి **'స్వామీ! మీరు బౌద్ధం స్వీకరించారా!** అని అడిగాడు.

ఆయన ప్రశ్నకు సమాధానంగా కౌండిన్యులవారు బుద్ధునికి సాష్టాంగ నమస్కారం చేసారు. వారి సమీపంలోనే వున్న సారిపుత్రుడు, మగ్గల్లాన కూడా బుద్ధునికి భక్తితో సాష్టాంగ నమస్కారం చేయటం చూసి బింబిసార చక్రవర్తి బుద్ధుని అద్వితీయ మహిమను గుర్తించి ఆయనకు సాష్టాంగపడి తనకు ఆయన బోధ మరింత శ్రద్ధగా వినాలని వుందని ఆయనను తనకు చేరువనేగల తన ప్రియమైన 'వేలువనానికి' ఆహ్వానించాడు.

వేలువనంలో బుద్ధుని బోధ ఆయన జీవితాన్నే మార్చేసింది. 'దళాధిపతిపైన, సేనాపతి– వానిపైన రాజులు వారిపై చక్రవర్తి ఇలా ఒకరిపై ఇంకొకరు అధికారం చూపిస్తారు. కానీ వారిలో ఏ ఒక్కరైనా తాము సంతోషంగా



ఉన్నామని చెప్పగలరా? ఆశా పీడితుడైన జీవికి మిగిలేది నిరాశే కదా! నిరాశ అశాంతికి, అశాంతి రోగానికి, రోగం మృత్యువుకు దారి తీస్తుంది. నీ వెనుకనే మృత్యువున్నప్పుడు ఏ ఆనందం నీకు నిజమైన నిత్యానందాన్నిస్తుంది?

నువ్వు గ్రహించలేని విషయాలు అగోచరమైన విషయాలు తెలుసుకునే ప్రయత్నంలో మానవత్వం మరిచిపోయి పరపీడనతో బ్రతకటం వైదిక ధర్మమని జీవహింస చేయటం తప్పుకదా!

ఆత్మజ్ఞానం నేర్వదలిచి సాధన చేసేవారు ఆత్మరూపం తెలియదంటున్నారు కదా! తెలియని దాన్ని ఏదో వాదనతో తెలిసిందని అనుకోవడం కన్నా సాధన ద్వారా మహోన్నతమైన ముక్తి పొందటం మంచిది కదా. రోగికి మందు ఎలా పనిచేస్తుందో తెలుసుకోవటం కన్నా మందు వాడడమే ముఖ్యం కదా! ఆత్మజ్ఞానం కన్నా దుఃఖమూలమైన కోర్కె నిగ్రహం నేర్వడం తగిన పనికదా!

అగ్నిని దేవతగా ఆరాధించే కన్నా అగ్నికార్యంతో దేహం పవిత్రమవుతుందని సనాతన ధర్మంలో అగ్నికార్యం



నిర్దేశించారని తెలుసుకోవటం ముఖ్యం కదా! ఆయన వాదన సబబుగా ఉందని బింబిసారుడే కాదు, చాలామంది పండితులంగీకరించారు. కొందరు బ్రాహ్మణులు అసంతృప్తులైనారు. ఆరోజు సత్సంగం ముగిసింది. మూడురోజులు సాగిన ధర్మబోధ అనంతరం బింబిసారుడు బౌద్ధమతం స్వీకరించాడు. అంతేకాక తన ప్రజల్ని ప్రోత్సహించి చాలామందిని బౌద్ధం స్వీకరించేటట్లు చేశాడు. ఆ సందర్భంగా వేలువనం బౌద్ధులకు ఆరామంగా ఇచ్చేశాడు. అప్పుడు బుద్ధుడు తన శిష్యులతో సంతోషంగా సత్కార్యం కోసం ఎవరేది ఇచ్చినా తీసుకుంటే తప్పులేదని చెప్పాడు.

బింబిసారుడు ఎందరో రాజులు తమ పరివారంతో సహా బౌద్ధం స్వీకరించేటట్లు చేయటమేగాక 'జేతవన విహారం' అనే విహారాన్ని తన సమీపంలో కట్టించి బుద్ధుడు వర్షాకాలం నాలుగు నెలలు అక్కడ ఉండేట్లు ఏర్పాటు చేశాడు.

కొందరు తిరుగుబాటుదార్లు బుద్ధుడు మతమార్పిడులు ప్రోత్సహిస్తున్నాడనే ప్రచారంతో కొందరు తిరుగుబాటు చేయగా, మూటముల్లె సర్దుకుని బౌద్ధభిక్షువులు, సంసారాలతో

అన్యబౌద్ధులు పారిపోవలసిన అగత్యం ఏర్పడినా సకాలంలో బింబిసారుడు తీసుకున్న చర్యలవల్ల ఆపద తప్పింది.

ఇదివరలో గౌతముడు చెన్నుని ద్వారా తన తండ్రి శుద్ధోధనునికి ఒక వర్తమానం పంపించాడు. తను జ్ఞానం పొందిన పిదప కపిలవస్తు నగరం చేరి, తన జనులకు ఆ వివరం తెలియ జేస్తానని చెప్పాడు. ఆ మాట నిలుపుకోవటానికి కపిలవస్తుకు శిష్యసంఘంతో సహా బయలుదేరాడు బుద్ధుడు.

తన తండ్రిని చూచి ఏడేళ్ళయింది. ఆయన తనకు ఒక వార్త పంపాడు. **పెద్దవాడినయిపోయాను, చనిపోయేలోగా ఒకసారి వచ్చి నన్ను చూసిపో.** ఆ వచ్చినవారు సంఘంలో చేరిపోయి తిరిగి కపిలవస్తు చేరే మాట కూడ మరచిపోయారు. శుద్ధోధనుడు, గౌతముని చిన్ననాటి స్నేహితుడైన 'కాలుదాయి' అను వానిని పంపించాడు. ఆతని ద్వారా తండ్రికి ఈ విధంగా సందేశం పంపాడు బుద్ధుడు. **తండ్రీ! మీరు మహారాజు, నేను సన్న్యాసిని. మనమధ్య మానవ పరస్పర స్నేహం తప్ప ఇంకేవిధమైన బంధం ఉండటం అనుచితం. ప్రవాహంలో**



**కొట్టుకొనిపోయే కట్టెలవంటి మానవుల మధ్య బంధం ఆ కట్టెపుల్లల బంధం లాంటిదే. వేరు వేరుగా వస్తాము, కలిసి పయనిస్తాం హఠాత్తుగా విడిపోతాం. ఈ కాసేపు కలయికలో బంధం పెంచుకోవటం ఎంత అవివేకం. ఈ తండ్రీకొడుకుల బంధం శాశ్వతమా!**

కం॥ కట్టె నదీప్రవాహమున గ్రక్కున ఇంకొక
దాని గూడుచున్
గట్టిగ బట్టి 'జంట' అయి కాలువలో బడి
కొంతదవ్వు అ
పుట్టున వోవు, పిమ్మట నిబద్ధత గూడిన
తోడు వీడదా!
అట్టివె లోకమందు గల అందరి బంధము
లీవెరుంగవే!

విజ్ఞులయినవారు ఈ సంయోగ వియోగాలకు బాధ పడరు. మరణమే సత్యము. మిగతావన్నీ అసత్యం. సర్వకాల



సర్వావస్థల్లో అన్నీ మీకనుకూలంగా జరుగుతాయా. ప్రజల్ని పాలించటం మీ ధర్మం. మీది అని మీబిడ్డ జీవితం కోసం మీరు చింతించటం ఎంత అవివేకం!

(ఇది శ్రీకృష్ణ పరమాత్మ గీతావచనమే కదా! అందుకనే ఈ రచయిత అభిప్రాయం బుద్ధభగవానుడు శ్రీకృష్ణునివలె అవతారమూర్తి. మేం నాస్తికులం దేవుడులేడు, గీవుడూలేడు అనేవారికి "అయ్యా నమస్కారం" అంటాను).

ఆ సమాధానం విన్న శుద్ధోధనుడు ఆత్మపరిశీలన చేసుకున్నాడు. నిజమే! తను భవిష్యత్తు తెలిసికూడా దేనిని ఆపగలిగాడు? మృత్యువుని జయించి జగద్గురువు అయిన తన 'కొడుకు' ను చూసి సంతోషించక తను అజ్ఞానంతో విలపిస్తున్నాడు. శ్రీరామచంద్రుని విడిపోయే దశరథునిలా శోకిస్తున్నాడు. తనుకూడా శోకించి పుత్ర దర్శన భాగ్యం పోగొట్టుకుంటే తనంత మూర్ఖుడుంటాడా! శుద్ధోధనుని విచారం మటుమాయమైంది.

బుద్ధుడు అంగ, మగధ దేశాలకు చెందిన పదివేల మంది శిష్యగణంతో, అనుచరులతో, సంఘ సభ్యులతో సాధు



సన్న్యాసులతో కలిసి కపిలవస్తుకి సమీపంలో గల **'న్యగ్రోధవనం'** లో బస చేశాడు. ఆ విడిదిని శుద్ధోధనుడు ముందుగానే తయారు చేయించి సిద్ధంగా ఉంచాడు. మరునాడు బుద్ధుని ఆహ్వానించి రాజభవనానికి తీసుకెళ్ళటానికి రాజవంశీయులు ప్రజలు గుంపులయ్యారు.

బుద్ధుడిలా అన్నాడు **'నేడు నేను సన్న్యాసిని. బుద్ధుణ్ణి. జన్మతః శాక్యవంశస్థుడైన ఈ శుద్ధోధన మహారాజు ఏకైక పుత్రుడను. నన్ను పెంచిన తల్లి ప్రజాపతి గౌతమి. నా భార్య యశోధర. నా పుత్రుడు రాహులుడు. 29 ఏళ్ళు మహా సౌధాల్లో నివసించి మనిషికి చావు అనేది, ముసలితనం అనేది ఉంటుందని తెలియకుండా పెరిగాను. కన్నీరంటే కష్టమంటే ఏమిటో తెలియక పెరిగిన నేను ఒకనాడు ప్రపంచంలో ఉన్నదే దుఃఖమని సుఖం మబ్బునీడలా అప్పుడప్పుడు వచ్చి పోయేదే కాని దుఃఖమే మనిషిని నీడలా అనుసరిస్తుందని గ్రహించి కలవర పడ్డాను. సత్యం తెలుసుకుంటే కాని అవిద్య రూపంలో వున్న అజ్ఞానం తొలగదు. వ్రణం లేచిన వానికి ఔషధం కడుపులోకి తీసుకోవాలి కాని నీటితో కడిగితే పోదుకదా.**

**దుఃఖోపశమనం సత్యాన్వేషణ ద్వారానే సాధ్యమవుతుంది. నేను అరణ్యం బాట పట్టాను. బంధ విముక్తి కోసం సన్న్యసించాను. ఎంతోమంది మునులను, పండితులను, జ్ఞానులను, సన్న్యాసులను కలిశాను. వారు చెప్పిన ఎన్నో సాధనలను ఆచరించాను. ఏడేళ్ళ తరువాత గయలో ఒక తెల్లవారుజామున దివ్యకాంతిని దర్శించి జ్ఞానోదయం పొందాను. ఆ తరువాత 7 వారాలు ధ్యానంలో ఉండి ఆ జ్ఞానానికి స్వస్వరూపం తెలుసుకున్నాను. బుద్ధుడనయ్యాను. సాధన తొలి రోజుల్లో నాగురువులు సహచరులైన కౌండిన్యుల వారిని సారనాథ్‌లో కలిసి నేను నేర్చిన సత్యాన్ని వివరించాను. వారి సహచర్యంలో బౌద్ధ సంఘములను స్థాపించి మరి కొందరికి నా జ్ఞానామృతం పంచిపెట్టాను. ఆ తరువాత మగధ చక్రవర్తి బింబిసారుని సహకారంతో మగధ, అంగ దేశాలలో బౌద్ధం అమృతధార లందించాను.**

**నేను అడవి దారిపట్టేముందు చెన్నుడనే నా సారథి ద్వారా నా తండ్రికి నా జ్ఞానోదయానంతరం కపిలవస్తు వచ్చి నాజ్ఞానం ఎరుక పరుస్తానని మాట ఇచ్చాను. ఈనాడు**



**మీముందున్నాను. ఒకప్పుడు మీ మిత్రుడను బంధువును అయిన నేను నిజానికి ఏబంధమూలేని 'తథాగతుడ'ను. బౌద్ధ సన్న్యాసిని. నాజ్ఞానం పంచిపెట్టి మీకిచ్చిన నామాట నిలబెట్టుకుంటున్నాను"** అన్నాడు.

ధారగా కన్నీరు ఆనంద భాష్పాలై శుద్ధోధనుడు కాసేపు మూగవోయి చివరికి గొంతు పెకల్చుకుని ఇలా అన్నాడు. **"నువ్వు నా కొడుకుగా జన్మించినా నిజానికి నువ్వు ఆ భగవానుడవు. బుద్ధ భగవానుడవై నన్ను నా వంశాన్నీ మోక్షమార్గంలో నడుపుటకు అవతరించావు నిన్ను నా కొడుకుగా భావించను. నువు నా పూర్వజన్మ సుకృతానివని నమ్ముతున్నాను. నా ప్రజలకి నాకు నీజ్ఞానం అందించు."** ఇంటింటా భిక్షమెత్తుతున్న బుద్ధుని జూచి ప్రజలు సంభ్రమాశ్చర్యాలలో మునిగిపోయారు. యశోధర బాధ తాళలేక గౌతముని వారించమని మామగారి నర్థించింది. ఆయనను బుద్ధుని వారించమన్నది. ఆయన బుద్ధునితో....



**ఉ॥ ఎక్కడి న్యాయమీ పగది ఎందుకు మాకడ**
**'బిచ్చ' మెత్తుచున్**
**చక్కని రాజధర్మమును జంపుదు విత్తరి**
**నీదు పత్నికిన్**
**మిక్కిలి దుఃఖమిచ్చెదవు మేలగునే ఇది**
**దీని నాపుమా,**
**నిక్కము నీదు శిష్యులకు నీకు నొసంగెద**
**భుక్తి మేలుగాన్.**

బుద్ధుడిలా అన్నాడు "రాజా! భిక్షుక వృత్తి బౌద్ధ సన్నాసి ధర్మము. చేయి జాచి ఎదుటివారిని అర్థించినప్పుడే 'అహం' నశిస్తుంది. అహం నశించనివాడు ముక్తికనర్హులు"

ఆ సమాధానం విని యశోధర శాంతించింది. కాని అతను ఆయన దగ్గరకు వచ్చేబదులు ఆయనే తన వద్దకు వచ్చి భిక్ష తీసుకోవాలని, అది తన హక్కులా గాక అభ్యర్ధనగా స్వీకరించి తనని తన బిడ్డను ఆశీర్వదించాలని ఆమె కోరింది.



సారపుత్ర, మగ్గల్లాలు తోడురాగా బుద్ధుడు యశోధర సముఖానికి వెళ్ళాడు.

బుద్ధుని చూడగానే ఆమె అతని పాదాలపై వాలి నమస్కరించి ధవళ వస్త్రధారియై కేశఖండన చేయించుకొని ఉన్న ఆమెతో బుద్ధుడు **"నేను స్థిర నిర్ణయంతో వున్నాను. మంచిని శుభాన్ని కోరుతున్నాను. నేను జ్ఞానార్థిని. ఇంక ఇది ఇంతే"** అన్నాడు.

ఆమాట ఆయన ఆంతర్యం తెలిపింది. ఆమె లోపలికి వెళ్ళి ఏడేళ్ళ రాహులుని తీసుకువచ్చి తండ్రిపాదాలకు నమస్కరింప జేసింది.

వారం రోజులు గడిచాయి. తనను కపిలవస్తులోనే వుంచేయాలనే ప్రయత్నాలు జరుగుతున్నట్లు గమనించాడు బుద్ధుడు. అగ్నిప్రవేశమైనా చేస్తాను కాని బౌద్ధ ధర్మం వదలనని తన నిశ్చయం తెలిపాడాయన. ఎందరికో దీక్షలిచ్చాడు.

మహా ప్రజాపతికి జన్మించిన తన తమ్ముడు నందుని వివాహం 'జనపద కళ్యాణి' తో జరుగుతున్నది. న్యగ్రోధవనం నుంచి బయలుదేరి ఆ వివాహానికి వెళ్ళి ఆశీర్వదించాడు

బుద్ధుడు. **"నీకు నిజమైన వివాహం, కాంతా సంయోగం కాదు కాంక్షా వియోగం. చతుర్విధ సత్యాలు గ్రహించి నిర్వాణ పథం చేరుకోవడమే సుఖప్రదం"** అన్నాడు. వివాహ వేదిక వదలిపోతూ తన భిక్షాపాత్రను నందునికిచ్చాడు బుద్ధ భగవానుడు. ఏమి విచిత్రమో కాని కళ్యాణ వేదిక మీంచి పసుపు బట్టలతోనే తథాగతుని అనుసరించాడు నందుడు.

అతనితో 'జనపద కళ్యాణి' **"మీ దారికడ్డురాను. కానీ ఎప్పుడైనా ఈ దీనురాలిపై దయకలిగినా, లేక మీ నూతన జీవితం మీకు దుఃఖం కలిగించినా నా ఇంటి తలుపులూ నా హృదయమూ, మీకోసం ఎదురు చూస్తుంటాయని మరువకండి"** అన్నది. ఆరోజుల్లో, స్త్రీలంత పరిపక్వ ప్రవర్తన కలిగి ఉండేవారని అర్థమవుతున్నది కదా.

ఏదో ఆవేశంతో అనంకల్పితంగా బుద్ధుని అనుసరించాడే కాని మొదట్లో ఆ సన్యాసి జీవితం నందునికి బాధాకరంగా పరిణమించింది. సంఘ సభ్యుడయినా కానీ విలువైన దుస్తుల మీద మనస్సు పీకుతూనే ఉన్నది. భిక్షా పాత్రకూడా విలువైనదే చేపట్టాడంటే అతనికి సన్యాసం



రుచించలేదని తెలుస్తూనే ఉన్నది. భార్య అందం ఆమె జ్ఞాపకాలు నందుని మనోవేదనకు గురిచేశాయి. ఆలోచనలు వాంఛ అధికమవజొచ్చాయి.

అప్పుడు బుద్ధుడతనిపై జాలిపడి ధర్మబోధ చేసి మనోస్థైర్యం ఇచ్చాడు. ఇక ఆ నందుడు వెనుదిరిగి చూడక గొప్ప బౌద్ధ ధర్మ బోధకుడై అపారమైన ఖ్యాతి నార్జించాడు.

బుద్ధుడు కపిలవస్తులో తన జ్ఞాన సిధ్యనంతరం, వెళ్ళినప్పుడు ఆయన్ని వసిష్ఠుడు, భరద్వాజుడు అనే ఇద్దరు బ్రాహ్మణ మతగురువులు కలిసి **నిర్వాణ స్థితి అంటే గ్రంధాలలో చాల చదివాం, కాని మీరు ఆ స్థితిని మీఅంతట మీరే పొందారని విన్నాం. అది ఎట్లా ఉంటుందీ తెలుపండి అన్నారు. బుద్ధుడు "ఓ బ్రాహ్మణులార! సత్యదర్శనం చేయించగలవాడే గురువు. గురువు చెప్పేది సాధనా పద్ధతి మాత్రమే. సత్యదర్శనం మాత్రం ఎవరికి వారే చేయాలి. సర్వసంగ పరిత్యాగి ఏవిధమైన మనో వ్యాకులత లేనందువల్ల త్వరగా జ్ఞానం పొందగలడు. ఒక్క నీతి వర్తనతోనే నిర్వాణం పొందటం సాధ్యంకాదు. శాంతచిత్తంతో ధ్యానంలో గడిపే**



**నీతిమంతుడే సత్యదర్శనం చేసి నిర్వాణం పొందగలడు"** అన్నాడు.

అది విని ఆ ఇద్దరు బ్రాహ్మణులు బుద్ధుని బౌద్ధం స్వీకరించుటకు సిద్ధపడ్డారు. బుద్ధుడు వారిని **మీరు బౌద్ధం స్వీకరిస్తే ఇతర బ్రాహ్మణులు మిమ్మల్ని నిందించరా" అని అడిగాడు. "నిందించి తీరుతారు, పనికి రాని బైరాగుల్లో కలిసిన భ్రష్టుడంటారు. కాని మాకు నిర్వాణం గురించి చెప్పగలిగిన జ్ఞానియే గురువు. మేము మా మతాన్ని చిన్నచూపు చూడడం లేదు. మా సందేహాలు తీర్చిన బౌద్ధాన్ని అనుసరిస్తున్నాం. చేయిపట్టుకుని నడిపించేవారి ననుసరించటం సహజం కదా!** అన్నారు ఆ బ్రాహ్మణులు.

ఒకరోజు బుద్ధుడు తన శిష్యసంఘాలతో కలిసి భిక్షాన్నం స్వీకరిస్తున్నాడు. శుద్ధోధనుడు అక్కడికీ యశోధర తోటి ఆమె బిడ్డ రాహులునితో కలిసి అక్కడికి వచ్చాడు. బుద్ధుని చూపించి యశోధర **'నాయనా! వారెవరో నీకు తెలుసా'** అన్నది. వారినేకదా బుద్ధ భగవానుడంటారు" అన్నాడు రాహులుడు. కన్నీరు పెట్టుకుంది ఆమె. 'నాయనా! ఆయనే నీ కన్నతండ్రి"



అన్నదామె. ఆసరికి భోజనం పూర్తిచేశాడు బుద్ధుడు. బుద్ధుని సమీపించి రాహులుడు **"తండ్రీ! నేనీ దేశానికి రాజునయ్యాక రారాజు నవుతాను. నీ సంపద అంతా నాదవుతుందట కదా! నీదగ్గర ఏవో గొప్ప నిధులున్నాయట కదా! అవి నాకు ఇవ్వరా?"** అని అడిగాడు.

దానికి బుద్ధుడు **"నాయనా రాహుల్! నా ఆస్తి నీవు కావాలంటే తప్పక ఇస్తాను"** అని వెంటనే సారిపుత్రుని పిలిచి రాహులుకి దీక్ష ఇప్పించాడు. అది చూసి శుద్ధోధనుడు "ఏమిటీ ఘోరం? ఈ బిడ్డ సంరక్షకుల అనుమతి లేక నువ్వెలా దీక్ష ఇచ్చావు మొన్నటికి మొన్న వివాహ దుస్తులలో వున్న నందునికి దీక్ష ఇచ్చి ఒక నూతన వధువు కన్నీటికి కారణమయ్యావు ఎందుకిలా చేస్తున్నావు" అన్నాడు.

నాటినుంచి చిన్నవారికి దీక్ష ఇవ్వటం విరమించాడు బుద్ధుడు. కానీ శుద్ధోధనుని తమ్ముడైన **అమితోదనుని** పుత్రుడైన **ఆనందుడు** అర్థించి మరీ దీక్ష తీసుకున్నాడు. "ఉపాలి" అనే మంగలి అదే తీరున దీక్ష తీసుకున్నాడు.

భిక్షుకి సంఘాలకు ప్రత్యేక నియమాలు పెట్టి వారికి

దీక్షలిచ్చి అంతవరకు స్త్రీ ఆధ్యాత్మిక విద్య నేర్వలేదనే అభిప్రాయం పటాపంచలు చేశాడు బుద్ధుడు. కాని ప్రజాపతి గౌతమి తనకు దీక్షనిమ్మని అడిగినప్పుడు నిరాకరించాడు బుద్ధుడు.

ఆ తరువాత బుద్ధుని పినతండ్రుల మేనత్తల కుమారులు దీక్షలు తీసుకున్నారు. వారిలో శుద్ధోధనుడి తమ్ముడు శుక్లోధనుడు శాక్యవంశ రాకుమారులు దేవదత్తుడు (మేనత్త కొడుకు), భృగుడు, కించిలుడు, ఆనందుని అన్న అయిన అనిరుధుడు, మిత్రుడైన చెన్నుడు మొదలగు వారు ఉన్నారు. 'ఉపాలి' చేత వారికి దీక్ష ఇప్పిస్తున్నప్పుడు వారు **ఇది మాకు మేలు చేస్తుంది. దీనితో మా అహం భావం నశిస్తుంది. ఎందుకంటే మా సేవకుడైన ఉపాలికి మేము సాష్టాంగ నమస్కారం చేయాలి కదా! ఇది మాకే మంచిది** అన్నారు.

విచిత్రమేమంటే నందుడు ప్రధమ శిష్యుడైతే దేవదత్తుడు బుద్ధుని ప్రబల విరోధి అయ్యాడు. ఇట్లా బుద్ధుని కొందరు ద్వేషిస్తే కొందరు ఆరాధించారు. ఏది ఏమయినా బుద్ధుడు తన నిర్ణయం మార్చుకునేవాడు కాదు. ఆయనకు



రాకుమారులైనా వారి బానిసలైనా ఒకటే. శిష్యులు పెక్కు రకాలుగా ఉంటారు.

బుద్ధుని మహా పరినిర్వాణానంతరం ఉపాలి సప్త ఫర్ణి గుహలో జరిగిన ప్రధమ సమావేశంలో వినయ పిటకమునకు సంబంధించిన ఉపదేశ సూక్తులు చెప్పాడు. అతని ధారణా వైభవానికి అందరూ ఆశ్చర్యపోయారు.

చం॥ ఒకడు దయాళు వింకొకడు ఊరకె ఈర్ష్యను
అగ్ని దగ్ధమౌ
ఒకడు నిదానవర్తనుడు ఓరిమి రూపము
దాల్చునట్లె యౌ
ఒకడు దురాశ పీడితుడు 'ఉర్వి'
లభించియు తృప్తి జెందదున్
ఒకనికి బోధిసత్త్వుడగు ఉత్తమ సిద్ధి
లభించు 'బుద్ధుడౌ'.

ఈ విధంగా తథాగతుని కపిలవస్తు యాత్ర ముగిసింది.



## 11. విఖ్యాత బౌద్ధులపై విహంగ వీక్షణం

బౌద్ధ వాఙ్మయంలో వేలాది ప్రముఖుల కథలు జీవిత చరిత్రలు ఉన్నాయి. అనేక జన్మలలో బోధిసత్త్వుని కథలు మానవాళికి మంచి బోధించాయి. అవన్నీ విపులంగా వ్రాయాలనే తపన ఉన్నా వ్రాయలేను. అంత 'శక్తి' లేదు. అయితే ఎందరో విఖ్యాత బౌద్ధుల పేర్లన్నా స్మరించాలని ఈ అధ్యాయం వ్రాస్తున్నాను. ఆకాశంలో ఎగిరే విహంగం భూమిపై తనకు కావలసిన 'తిండిని' పైనుంచి ఎగురుతూనే చూసి దానిని పట్టుకోగలననే నమ్మకం ఉంటేనే చటుక్కున వాలి తన్నుకుపోతుంది.

ఇక్కడ నేను కూడ ప్రఖ్యాత బౌద్ధుల గురించి చాలా క్లుప్తంగా చెబుతాను. దీనివల్ల వారి పూర్తి కథ తెలుసుకోవటం సాధ్యంకాదు. కాని ఫలానావారు బుద్ధుని అనుసరించి సద్వర్తనులైనారని తెలుస్తుంది. అది ఏ ఒక్కరికి స్ఫూర్తినిచ్చినా ఈ రచన లక్ష్యం నెరవేరినట్లే.



**అంగుళీమాలుడు :**

దుర్మార్గుడు మంచివాడైతే లోకం వాడి మంచిని చేతకాని తనంగా జమకట్టి వాణ్ణి మంచిగా ఉండనివ్వదు లోకం. బుద్ధునివంటి గురువు లభించిన వారికేమోగాని చాలమంది తిరిగి చెడుదారి పట్టే ప్రమాదముంది.

ధర్మబోధకు ఒక గ్రామంనుంచి ఇంకొక గ్రామానికి నడిచిపోయేవాడు, బుద్ధుడు. ఒక ఘోరమైన అడవిలో ఆయనకు అంగుళీమాలుడు అనే క్రూరుడు కనిపించాడు. వాడు ఎవరో గురువు చెప్పిన మాటను నమ్మి మనుష్యుల్ని చంపి వారిచేతి చిటికెన వ్రేళ్ళ(అంగుళి) ను నరికి ఒక మాలలో గుచ్చి మెడలో ధరిస్తున్నాడు. నిర్దయుడైన అతనంటే ఎంతోమందికి ద్వేషం ఉంది. కానీ ఏమీ చేయలేక ఊరకున్నారు.

బుద్ధుడు అతనిని అడవిలో, చూసినప్పుడు వాడు బుద్ధుని దివ్యతేజస్సుకు అబ్బురపడి, **'ఓయీ! నాదగ్గరకు రాకు నేను నిర్దయుడను. అంగుళీమాల ధారణా వ్రతుడను. ఈ మాల**

**చూస్తే నేనంటే భయం కలుగుట లేదా? నామాట విని నీదారిన నువ్వు పో లేకపోతే నాకు బలి అవుతావు"** అన్నాడు.

దానికి బుద్ధుడు **"నీవే దుర్మార్గుడివైతే నాతో తీరికగా మాట్లాడుతూ కూర్చోవు. నీలోనూ హృదయం ఉంది. నీ గురువెవరో కాని ఒకటి తెలుసుకో. పరులను బాధించే వారికి ఏనాటికీ మంచి జరుగదు. ఇంకొకడి కన్నీటికి కారణమైతే నీకూ కన్నీరే మిగులుతుంది. నన్ను చంపితే నీకు ఇంకా రెండు అంగుళీలు దొరుకుతాయి. కానీ నాలోని జీవికి కలిగే బాధ నీకు తీరని నరకాన్నిస్తుంది. ఒకరికి జీవం ఇవ్వలేని వారికి దానిని తీసుకునే హక్కు ఎక్కడిది?"** అన్నాడు.

వాడు పశ్చాత్తాపంతో తనకి సన్మార్గం కావాలని వేడుకొని బుద్ధుని శిష్యుడైనాడు. అడవిలో అతన్ని వెదుకుతూ వచ్చిన ఆతని తల్లి నివ్వెరబోయి తరువాత సంతోషించి బుద్ధుని పాదాలపై పడింది. దుఃఖనివారణోపాయం సన్మార్గమని తెలుసుకున్న అంగుళీమాలుడు భిక్షువై రాగద్వేషాలను వదలివేశాడు. దేశదేశాలలో ఈ కథ విని బుద్ధుని గొప్పతనం అందరూ కీర్తించారు.



కాని పూర్వం అతనిచేత హింసించబడిన కొందరు పగ తీర్చుకోవాలని పన్నాగం పన్నారు. ఒకరోజు భిక్ష స్వీకరించి తిరిగి వస్తున్న అతనిపై దాడి చేసి తీవ్రంగా కొట్టారు. రక్తస్రావంతో బుద్ధునిచేరి అతడు **"ప్రభూ! నేను మీ 'త్రికరణాలను' నమ్మేను. ఇప్పుడు నా గాయాలు నా పాప పరిహారం కోసం నాకు లభించినవే. నేనింక బ్రతుకను. అనుజ్ఞ ఇవ్వండి. మీరు నన్ను క్షమించారు. నాకంతే చాలు"** అన్నాడు. ఆ తరువాత అతను మరణించాడు.

బుద్ధుని శిష్యులు **"స్వామీ! ఇతడు స్వర్గానికి పోతాడా? నరకానికి పోతాడా'** అని అడిగారు. దానికి బుద్ధుడు **"ఇతడు స్వర్గ నరకాలు రెంటికీ అతీతుడు. మరణ సమయంలో పశ్చాత్తాపంతో సన్మార్గాన్నవలంభించేవాడు జన్మరాహిత్యం చెంది మోక్ష ప్రాప్తి నొందుతాడు. ఇతడు ధన్యజీవి"** అన్నాడు.



**చెన్నుడు :**

గౌతముడు, బుద్ధ భగవానుడుగా మారి ప్రపంచాన్ని ఉద్ధరించడానికి మూలకారకుడు చెన్నుడు. గౌతముడు నగర సంచరం చేస్తానని తన కోరిక తెలిపినప్పుడు శుద్ధోధనుడు అతనికి చక్కని గుర్రాలు పూన్చిన రథం ఏర్పాటు చేసి దానికి సారధిగా చెన్నుడను వానిని నియమించి వానిని నగరంలో అందమైన ప్రదేశాలకు మాత్రమే తీసుకు వెళ్ళాలని ఎవరింటికీ పోకూడదని, ఎక్కడెక్కడికి పోయిందీ ఏమయ్యిందీ తనకి ప్రతిరోజూ వివరించాలని తెలిపాడు.

ఆ తరువాత గౌతముడు వృద్ధుని, రోగిని, చనిపోయిన వానిని, సన్న్యాసిని నాలుగు రోజుల నగర పర్యటనలో చూచి చెన్నుని అడిగి మానవులందరికీ ఆ యాతనలు తప్పవని తెలుసుకుని ప్రపంచాన్ని ఆ పాట్లనుంచి తప్పించటానికి కన్నబిడ్డ మొఖమైనా చూడక భార్య యశోధరనొదలి కపిలవస్తునగరాన్ని వదలి అడవులకి పోయి 7 ఏళ్ళకు



బుద్ధుడుగా మారిన కథ పాఠకునికి పరిచయమే.

తరువాత చెన్నుడు బుద్ధుని సంఘంలో చేరిపోయి బౌద్ధ సన్న్యాసి అయ్యాడు. అతనంటే బుద్ధునికి అమిత వాత్సల్యం ఉండటం సహజమే. కాని మానవుని చిత్తవృత్తులు బహువిచిత్రమైనవి.

చెన్నుడు తను అందరికన్నా బుద్ధునికి ఇష్టుడనని అహంకరించాడు. బ్రాహ్మణులు, సద్వర్తనులు బుద్ధునికి ఆత్మీయులు, అయిన సారిపుత్త, మగ్గల్లానాలంటే అతనికి వైషమ్యం అకారణంగా ఉండేది. వాళ్ళు గొప్పగా భావించుకుంటారు. కానీ తనే వారికంటే శ్రేష్ఠుడనని అందరికీ చెప్పుకునే వాడు చెన్నుడు. అది తెలిసి బుద్ధుడు అతనిని మొత్తం మూడుసార్లు మందలించాడు. కాని చెన్నుడు తనపద్ధతి మార్చుకోలేదు. బుద్ధుడు అతనితో **"చెన్నా! వారిద్దరూ నీకు మంచి స్నేహితులు వారితో మంచిగా ప్రవర్తించు"** అని చెప్పాడు. బుద్ధుడు బ్రతిమాలినప్పటికీ అతడు తన పద్ధతి

మార్చుకోలేదు. చెన్నుడు వారిద్దరినీ నిందిస్తూనే ఉన్నాడు.

బుద్ధుడి విసిగిపోయి **ఇది నిజం ఈ చెన్నుడు నేను జీవించి వుండగా అతడు మారడు.** నేను మహా పరి నిర్వాణం చెందాక గాని అతను మారడు" అన్నాడు. తను నిర్వాణం చెందేరోజు సాయంత్రం బుద్ధుడు ఆనంద్‌ని పిలిచి **"చెన్నుడికి బ్రహ్మదండ శిక్ష విధించు"** అని చెప్పాడు. అంటే చెన్నుని ఉపేక్ష చేసి ఉంచటం. దానిమూలంగా బౌద్ధులు ఎవరూ అతనితో ఏ సంబంధం పెట్టుకోరు. అతను వారిని మాట్లాడించినా మాట్లాడరు. ఆ సంగతి తెలిసిన చెన్నుడు పశ్చాత్తాపం చెంది ఆవేదన తాళలేక మూడుసార్లు మూర్ఛపోయాడు. భిక్షువులందరిముందు తన తప్పు ఒప్పుకుని అందరినీ పేరుపేరునా క్షమించమని అభ్యర్థించాడు.

ఆక్షణంనుంచి అతను తన దృష్టి, తన దృక్పథం మార్చుకుని సద్వర్తనుడై, ధ్యాన నిమగ్నుడై తగిన అర్హత సంపాదించుకున్నాడు.



**ప్రసేనజిత్ :**

మగధ తరువాత అంతటి బలమైన ఇంకొక సామ్రాజ్యం కోసల. దాని రాజధాని 'శ్రావస్తి'. దాని మహారాజు ప్రసేనజిత్తు. ఆయన్ని 'పాసినాడి' అనికూడా ఆధునికులు పిలుస్తారు. శ్రావస్తి, మగధరాజధాని 'రాజగృహ' కు 45 యోజనాలు. ప్రసేనజిత్తు సోదరిని బింబిసారుడు వివాహం చేసుకున్నాడు.

బింబిసారుని ద్వారా బుద్ధునికి పరిచయమైన ప్రసేనజిత్తు ఆ శాంతమూర్తిచే ఆకర్షింపబడి బుద్ధుని తన రాజధానికి ఆహ్వానించాడు. అఖండ పేరొలగమున, బ్రాహ్మణుల సమక్షమున ఆయన బుద్ధుని దివ్యబోధ విని ఆనంద పరవశుడై బౌద్ధం స్వీకరించాడు. అతను ఇదివరకు సనాతన ధర్మమును అవలంభించిన నిష్ఠాగరిష్ఠుడైనప్పటికీ బౌద్ధ ధర్మాన్ని స్వీకరించటమే కాక విస్తరింప చేశాడు. అతని భార్య మల్లిక్, చెల్లెలు సోమ కూడ బౌద్ధమతం స్వీకరించారు.

శ్రావస్తి వస్తున్నప్పుడు బుద్ధుడు స్వయంగా



అస్పృశ్యురాలయిన ఒక స్త్రీకి దీక్ష ఇచ్చాడని తెలిసి బ్రాహ్మణులందరూ రాజుకు బుద్ధునిపై నేరారోపణ చేశారు. రాజు కూడా అప్పటిదాకా అంటరానితనాన్ని పాటిస్తూ తనకు పూర్వజన్మ పుణ్యంవల్లనే ఉత్తమమైన క్షత్రియ జన్మ వచ్చిందని, అస్పృశ్యత ఆ స్త్రీ పూర్వజన్మ కర్మవల్ల వచ్చింది. అది ఆమెకు భగవంతుడు విధించిన శిక్ష. ఈవిధంగా సాగుతుంది ఆ వాదన. బుద్ధుడేమంటాడంటే **భగవంతునికి ఇష్టాలు అయిష్టాలూ ఉండకూడదు. ఉంటే మనిషి అవుతాడు. దేవుడెట్లా అవుతాడు**? (గీతాచార్యుడు కూడా నాకు ఇష్టాలూ అయిష్టాలు అంటూ ఎవరూ లేరు సత్త్వగుణం కలవారు నావారు అన్నాడు కదా!) **కాబట్టి మనం ఏర్పాటు చేసుకున్న ఆంక్షల్ని వాటిలో మంచిలేకపోతే వాటిని పాటించడం ఎందుకు? బ్రాహ్మణులు చెప్పారని అంటున్నావు కదా! బ్రాహ్మణుదెవరు**?



**చం॥ అనువుగ తామరాకు పయి ఆ జలబిందువు**
**వోలె సంగమున్**
**తనువిడి, అంపమందుగల దంతములం బడు**
**ఆవగింజలా**
**ఘనముగ రాగద్వేషములు కాంచని శ్రేష్ఠుని**
**లోకమందునన్**
**వినుమిది జ్ఞాన వృద్ధులిల 'విప్రుడు' అందురు**
**వానినో నృపా!**

ఈ విధంగా బుద్ధుడు ఆయా సందర్భాల్లో ఆయా జ్ఞాన బోధ ద్వారా తన శిష్యులకి హితవు నేర్పాడు. స్థలా భావం వల్ల ఆ బోధలు క్లుప్తంగా కూడా పేర్కొనలేక పోతున్నాను. దీని ఉద్దేశ్యమే "విహంగ వీక్షణం" కదా.

బౌద్ధం కోసల అంగరాజ్యాలలో విస్తరించడానికి ఎంతో కృషి చేశాడు ప్రసేనజిత్తు. ఎన్నో ఆరామాలు కట్టించాడు. బుద్ధుడు జైన మతస్థులయిన తీర్థంకరులను కూడా ఎదురు నిలిచి తన ధర్మం శ్రేష్ఠమని నిరూపించాడు. ప్రసేనజిత్తు

బుద్ధునితో **"స్వామీ మీరు అనుభవంలేని చిన్నవారు. వారికే అతికష్టమైన సత్యావగాహన మీకెట్లా కలుగుతుందని మిగతా మతస్థులు అంటున్నారు. నాకు సందేహం నివారించండి"** అన్నాడు.

బుద్ధుడిలా అన్నాడు. **రాజా! నాలుగింటిని చులకనగా చూడరాదు. 1. ప్రతాపవంతుడు, కీర్తిమంతుడూ అయిన క్షత్రియుని చిన్నవాడు అని తిరస్కరిస్తే, రాబోయే రోజుల్లో ఆపద తప్పదు. 2. పాము చిన్నదని దయతలచి ఆశ్రయమిస్తే అది కోరలలో విషం సంతరించుకున్నాక తప్పక కాటువేస్తుంది. 3. నిప్పు చిన్న రవ్వయే కదా అని నిర్లక్ష్యం చేస్తే సర్వ దగ్ధమూ చేస్తుంది. అగ్నిచే కాల్చబడిన చెట్టు చిగురించగలదు గాని, జ్ఞానాగ్నిలో దగ్ధమైన వానికి మరుజన్మ ఉండదు.**

**నాయనా! భిక్షువుకి, సన్యాసికి, జ్ఞానికి వయస్సుతో నిమిత్తం లేదు. అతను సదా పూజార్హుడే.** ఇది విని ప్రసేనజిత్తు "త్రిశరణా"లు పాటించి ధన్యుడైనాడు.



**ఆమ్రపాలి :**

ఈమెనే 'అంతాపాలి' అని కూడా అంటారు. ఆమె గొప్ప ధనవంతుడైన ఒక వైశ్యుని కూతురు. సాటిలేని సౌందర్య రాశి. వైశాలిలో గల పలువురు రాకుమారులు ఆమెచే ఆకర్షింపబడి ఆమెను పరిణయమాడాలని ఉవ్విళ్ళూరేవారు. వారి దురంతాల పరిణామంగా ఆమె వేశ్య అయింది. గొప్ప నృత్య కౌశల్యంగల ఆమె చివరికి గొప్ప రాజనర్తకి అయింది. దేశ విదేశాలలో కూడ ఆమెపేరు మారు మ్రోగింది.

ఒకసారి బుద్ధుని దర్శనం పొందిన ఆమె ఆయనను తన ఇంటికి భిక్షకు ఆహ్వానించింది. తథాగతుడు అందుకంగీకరించాడు. ఆ సంగతి తెలిసి నగరంలోని 'పెద్దలు', బ్రాహ్మణులు నిరసించి బుద్ధుడు ఆమె ఇంటికి వెళ్ళరాదని అది తమకి అవమానమని హెచ్చరించారు. బుద్ధుని స్థిర సంకల్పాన్ని ఏమీ చేయలేక వారు ఆమ్రపాలిని బ్రతిమిలాడి **నీ భిక్షమాకు ఇస్తే మేము బుద్ధునికి అందచేస్తాము** అన్నారు. ఆమె దానికి నిరాకరించింది.



బుద్ధుడు ఆమె ఇంటికి వెళ్ళాడు. ఆమె బుద్ధుని పక్కన కూర్చుని స్వయంగా తినుబండారాలన్నీ వడ్డించి భగవంతునికి భక్తుడు (శ్రీకృష్ణుడు ఆనాడు హస్తినాపురం రాయబారానికి వెళ్ళి విదురుని ఇంట్లో నివసించినప్పుడు ఆయనకు భక్తితో విదురుడు వడ్డించి తినిపించినట్లు) వలె అనిపించింది.

**"నిన్ను ఈ స్థితికి తెచ్చింది. మానవునిలోగల దురాశ, స్వార్ధం, దుర్మార్గం. ప్రపంచంలోగల అసమానతలకు అసలు కారణం వెదకి పరిష్కరించక ఇది మనం చేసుకున్న కర్మ అనే పలాయన వాదం తగదు. ఈ అసమానతలను విధించింది భగవంతుడు అనే వాదం నిజం అని నమ్మలేం ఎందుకంటే మనబిడ్డల్లో ఒకరికి రాజదండన లభించేట్లు మనం చేస్తామా? వాడు దారిలో దొంగల చేత దోచబడేట్లు మనం చేస్తామా. వాడి మరణానికి దారితీసే భోజనం మనం ఇస్తామా? కాబట్టి మన చెడుకి కారణం మనం మంచి చేయకపోవటమే. జాగ్రత్త పాటించక పోవటమే. గత జన్మలో మనం చేసిన చెడుకి ఫలితంగా మనకి మరుజన్మలో మరపు అజాగ్రత్త దుస్సాంగత్యం చెడు సహవాసం లభిస్తాయి. మంచికి**



**ఇవన్నీ మంచివే జరుగుతాయి. నీమీద కోర్కెతో ద్వేషంతో దుర్మార్గంతో మనుష్యులు చేసిన దానికి కనిపించని దైవాన్ని బాధ్యుడనటం గుర్రంమీంచి పడిపోవడం నీచేతగాని స్వారీవల్లకాదు. నువ్వు వచ్చేప్పుడు దైవప్రార్ధన చేసుకోక పోవటం అన్నట్లుంటుంది. మనం చేసే దురాగతాలకి అన్యుల్ని బాద్యుల్ని చేయటం పలాయన వాదనం. నీకు శాంతి లభించాలంటే జ్ఞానం పొందాలి, అంతే"** అన్నాడు.

ఆతరువాత ఆమె సంఘంలో చేరి బుద్ధుని త్రిశరణాలు నమ్మి జీవితం ధన్యం చేసుకున్నది.

**అజాత శత్రువు :**

అజాత శత్రువంటే ఏ శత్రువూ పుట్టనివాడని అర్ధం. ఇతను మగధ దేశాధీశుడైన బింబిసారుని కుమారుడు. దుర్మార్గుడైన దేవదత్తుని స్నేహితుడీ అజాతశత్రు. అతని ప్రోద్బలంతో మగధ సింహాసనం చేజిక్కించుకోవాలని అజాతశత్రు ప్రయత్నాలు సాగించాడు. దేవదత్తునికి బుద్ధుని చంపాలని ఆలోచన. దానికి అతనికి అజాత శత్రు సహాయం కావాలి.

దేవదత్తుని సలహాపై అతను మగధలో తన తండ్రి వృద్ధుడై రాజ్యపాలనకు అశక్తుడవటమే కాక. బౌద్ధ సన్యాసులతో తిరిగి కాలయాపన చేస్తూ క్షత్రియ ధర్మాన్ని విస్మరిస్తున్నాడని ప్రజాక్షేమం మరచిపోవటమే కాక నిర్వీర్యుడైనాడని ప్రచారం చేసి రాజ్యాధికారం చేబట్టాడు. ప్రజాహితంగా పరిపాలిస్తానని ప్రజలను నమ్మించాడు. మంత్రి సామంతులతో మంతనాలు జరిపి తండ్రిని చెరసాలలో పెట్టాడు.

ఒకరోజు ఉదయం నుంచి బుద్ధుడు గంభీరంగా మౌనంగా ఉన్నాడు. ఎవరినీ పలుకరించలేదు. ఆయనెందుకలా ఉన్నాడో ఎవరికీ తెలియలేదు. ఆరోజు ఎవ్వరూ భోజనం చేయలేదు. బుద్ధుని పలుకరించటానికి ఎవరూ సాహసించలేదు. సాయంకాలం వేళకి ఆయన మామూలు స్థితికి వచ్చి అందరితో మామూలుగా మాట్లాడాడు. జ్ఞానులకి దివ్య స్ఫురణ ఉంటుంది. ఏదో జరుగకూడనిది జరిగింది. ఏదో తెలియని భీతి వారినావహించింది.



ఇంతలో ఇద్దరు వార్తాహరులు అశ్వంమీద వచ్చి ఒక వార్త తెచ్చారు. ఆరోజు అజాతశత్రు బింబిసారునికి మరణ శిక్ష అమలు చేశాడు. దొంగ కొత్వాలుని కొట్టడం అంటే ఇదే. భటులతో తను రాజగృహకు త్వరలోనే వస్తానని చెప్పాడు బుద్ధుడు. శిష్యులు కలవరపడి వద్దన్నారు.

బింబిసారునికి తన చెల్లెలినిచ్చి వివాహం చేసి భరణంగా ఇచ్చిన గ్రామాల శిస్తు కట్టుటకు నిరాకరించాడు, కోసలరాజు ప్రసేనజిత్తు. అలిగి ఆయనపై దండెత్తి అజాతశత్రు యుద్ధంలో ఓడిపోయాడు. ప్రజాహితం కోరిన పలువురు పెద్దలు సంధిచేసి ప్రసేనుని కూతురును అజాతశత్రుకిచ్చి వివాహం జరిపించి అవే గ్రామాల కప్పం తిరిగి అజాతశత్రుకి చెందేలా చేశారు. దానితో అజాతశత్రులో గొప్పమార్పు వచ్చింది.

కాని దేవదత్తునిలో మార్పు రాలేదు. అతను బుద్ధుని హత్య చేయించుటకు మగధ సేనాని ద్వారా ఎన్నో ప్రయత్నాలు చేసి విఫలమయ్యాడు. సంగతి తెలిసిన అజాతశత్రు అతని స్నేహం మానివేసి పంపించివేశాడు.

మంచివారిలో కొందరు స్థిరచిత్తులు కానివారు



ఉంటారు. వారి మనసు గాలిలో దీపంవలె రెపరెపలాడుతుంటుంది. తిరిగి దీపాన్ని తగిన చోట ఉంచితే నిశ్చలంగా ఉంటుంది. దేవదత్తుని దుష్టరాజనీతి వల్ల బుద్ధునికి వ్యతిరేకంగా మాట్లాడిన కొందరు శిష్యులు తమ తప్పు గ్రహించి బుద్ధుని కాళ్ళపైబడి క్షమాభిక్ష వేడారు.

ఒక నిండు పౌర్ణమి వెన్నెల్లో రాజగృహ సమీపంలోని అజాతశత్రు తన మంత్రులు హితులతో ముచ్చటిస్తూ సంతోషంగా ఉన్నాడు. బుద్ధుడు ఆ సమీపంలోని వేలు వనంలో విడిది చేసి ఉన్నాడని తెలిసింది. అప్పటి వరకు చర్చిస్తున్న రాజు ఇలా అడిగాడు **"అంతిమ సత్యం ఏమిటి? నిజమైన జ్ఞానాన్ని ఎవరీయగలరు?" అతని మంత్రులలో ఒకరు ప్రభూ!అటువంటి గురువు బుద్ధ భగవానుడే. ప్రస్తుతం ఆయన వేలువనంలోనే ఉన్నాడు. ఆయన మీసందేహాలన్నీ తీర్చగలడు"**

అప్పటికప్పుడు 500 మంది సుందరీమణులతోనూ 500 ఏనుగులతోనూ అట్టహాసంగా బయలుదేరాడు అజాతశత్రు.



వేయిమందికి పైనున్న శిష్యులతో మాట్లాడుతున్న బుద్ధుడు హఠాత్తుగా మౌనం వహించాడు. అది చూసి అజాతశత్రుకి భయంవేసింది. అక్కడికి తన్నుతీసుకువచ్చిన మంత్రికేసి అనుమానంగా చూసాడు. **"ప్రభూ! నన్ను నమ్మండి. బుద్ధుని ఆశీర్వాదం తీసుకోండి అంతా మంచే జరుగుతుంది"** అన్నాడాయన.

బుద్ధుని జూచి ఆయన పాదాలపై బడిన అజాతశత్రు తథాగతుని ఈవిధంగా ప్రశ్నించాడు.

**చం॥ పదములపైన తానుబడి భక్తిని జూపె**
**నజాతశత్రుడున్**
**మదిపులకించి బుద్ధునికి ప్రార్థన పూర్వక**
**సుస్వరంబునన్**
**కుదిరిన నమ్మికన్ అడిగె గొప్ప రహస్యము**
**దెల్పగోరుచున్**
**ముదముగ నాదు సందియము ముందుగ**
**దీర్తురె? ఓ గురూత్తమా!**

బుద్ధుడు శాంతచిత్తుడై అడగండి అన్నాడు. **"లోకంలో మనిషి చేసే ఏ పనికైనా ఫలితం స్పష్టంగా కనిపిస్తుంటుంది. మరి మీ బౌద్ధ భిక్షువులు చేసే పనులకి ఈ జీవితంలో మంచి అంటూ ఏమన్నా ఫలితం ఉంటుందా?"** అని అడిగాడు అజాతశత్రు.

**రాజా! మీ బానిసకి కూడా కొన్ని కోర్కెలుండి ఉండవచ్చు. అవి అన్నీ తీరుతాయా? మీరే మంటారు. ఈ కోరిక తీరుటకు నీవు అర్హుడవా అంటారు. అట్లాగే నీకే కాదు బౌద్ధ భిక్షువుకి కూడా కోర్కెలుంటే అన్నీ తీరవు. కానీ కాషాయం గట్టి శిరోముండనం చేయించుకున్న భిక్షువు అయితే ఆ బానిసను మీరేం చేస్తారు**? తిరిగి ప్రశ్నించాడు బుద్ధుడు. వచ్చి మీ బానిసగా తిరిగి చేరమంటారా?

**"అడగను. సంతోషంగా అంగీకరిస్తాను"** అన్నాడు రాజు. **"అంటే సన్యాసి జీవితానికి ప్రత్యక్ష ఫలితం ఉన్నట్లే కదా!"** అన్నాడు బుద్ధుడు. **"సరే! ఇంకా ఏమన్నా ఫలితం ఉంటుందా?" "రాజా! తప్పక ఉంటుంది. కత్తితో తలనరికేవాడు కత్తి విసిరి పారేసి శాంతి కోరతాడు. సన్యాసిపై**



**ఎవరికీ ద్వేషం ఉండదు"** అన్నాడు బుద్ధుడు.

**"ప్రభూ! అలాగయితే నావంటి పితృహంతకుడిని మీరు క్షమిస్తారా నాకు పాపవిముక్తి ఉంటుందా"** అని బుద్ధుని కాళ్ళపై బడ్డాడు అజాతశత్రు. అతనికి జ్ఞానబోధ చేసి చరిత్ర మరువలేని గొప్ప సద్వర్తనుడైన చక్రవర్తిగా మారిపోయేట్లు చేశాడు తథాగతుడు.



## 12. తథాగతుని మహాపరి నిర్వాణము

అది క్రీ.పూ. 563 వ సంవత్సరము. బుద్ధుడు కపిలవస్తులో జన్మించి అప్పటికి 85 సంవత్సరాలైంది. 28వ ఏట జ్ఞాన దర్శనానికి అడవిమార్గం పట్టిన సిద్ధార్థుడు 35వ ఏట జ్ఞాన జ్యోతిని దర్శించి బుద్ధుడయ్యాడు. సత్యం ప్రబోధించే బుద్ధ భగవానుడయ్యాడు. 50 సంవత్సరాలు అనేక రాజ్యాలు, నగరాలు, పల్లెలు, జనపదాలు దర్శించి కులమత బేధం లేక స్త్రీ పురుషులనే బేధం లేక వేలాది శిష్యులకు దీక్షనిచ్చి ఆ సన్యాసి గణంచేత తన బౌద్ధమతం నలుదిక్కులా వ్యాపింపచేశాడు.

ఆనందుడు, అనిరుద్ధుడు, సారిపుత్రుడు, కశ్యపుడు అనే నలుగురు శిష్యులు నీడలా ఆయనను అనుసరించి బౌద్ధ ధర్మ విస్తరణలో ఎంతో సహాయపడ్డారు. ఒకసారి వైశాలి నగరంలో తన 84వ ఏట ధర్మబోధ చేస్తూ **ప్రియ భిక్షుకులారా! నా ఆయువు 3 నెలల గడువుతో ముగుస్తుంది. విచారించక మీ**



**సందేహాలు తీర్చుకోండి** అన్నాడు. అమంగళం అప్రతిహతమగు గాక! అనుకొన్నారు శిష్యులు. కాలము గడిచి పోవుచున్నది. కశ్యపుడు కాక మిగిలిన ముగ్గురు మరికొద్దిమందితో కలిసి 'పావా' అను ఊరు చేరాడు బుద్ధుడు.

ఆ ఊరిలో 'చందుడు' అనే కమ్మరివాడు బుద్ధుడంటే అమిత విశ్వాసం కలవాడు, ఆయనను కలిసి **'స్వామీ! నా ఇంట భిక్ష స్వీకరిస్తారా** అని అడిగాడు. తథాగతుడందుకు అంగీకరించాడు. రొట్టెలు, మధురాహారములు, అడవి పంది మాంసంతో చేసిన వంటకాలు సిద్ధం చేశాడు చందుడు. బుద్ధుడతనితో తనకు మాత్రమే మాంసము వడ్డించి తక్కిన వారికి మిగతావి పెట్టు అన్నాడు. (బుద్ధుడావిధంగా అనటం నాకు మొదట్లో నచ్చలేదు. కానీ బాగా ఆలోచించి, సత్యం తెలుసుకున్నాను. ఆ పదార్థం ఏదో కారణం వల్ల విషతుల్యమైనదని అది తన మరణానికి" సోపాన మార్గ" మని, తథాగతుడు ముందే గ్రహించి ఉండాలి) ఏది ఏమైనా విందు ముగిసి తిరిగి ప్రయాణమయ్యాడు, బుద్ధుడు. ఆయనకి

ఉన్నట్లుండి 'రక్తగ్రహణి' (రక్త విరేచనాలు) అనే వ్యాధి పట్టుకుంది. చూస్తుండగానే నీరసించి శల్యమైపోయాడు. ఆ బాధ వర్ణనాతీతం. ఆయన్ని చూచి ఆనందుడు బుద్ధుని జోశ్యం నిజమవుతున్నదని రోదించసాగాడు. బుద్ధుడు వారికి ధైర్యం చెప్పి ఇలా అన్నాడు.

**ఉ॥ ఎంతటి వారికైన తరమే! భువి జన్మ ధరించి బంధుగుల్**
**సంతసమందగా పెరిగి చక్కని భార్య సుతాళి బొందితా**
**నెంతగ 'జుర్రినన్' తమిని యెన్నడు దీరని, జీవయాత్రలో**
**అంతము జెందు మానవున, కాపుటసాధ్యమె! ఈ విధానమున్**

కాబట్టి విచారించకండి "ఆనందా! నా 'కావిబట్ట' ఇక్కడ బరచుము. కొంతసేపు విశ్రమించెదను. కొంచెము త్రాగునీరు నిమ్ము గొంతు యెండుకొని పోవుచున్న" దని తథాగతుడు



అన్నాడు. ఆ తరువాత తానే స్వయముగా లేచి కొంతసేపటికి కుకుస్తా నదికి బోయి స్నానమాచరించి నీరు ద్రావెను. ఆ బర్హినది కాశీనగరమునకు నాలుగు కోసుల దూరములో నున్న గండకీ నదిలో సంగమించును. వారు మెల్లగా కుషీనగర సరిహద్దు వరకూ వచ్చిరి. అక్కడ **"ఆనందూ! ఈ వనము దాటి నడువలేను. రెండు కవల చెట్లు మధ్యనాకు ఉత్తర దిశలో తల ఉండునట్లు పడక నేర్పాటు చేయుము. నా సమయమాసన్నమైనది. దీనికి చందుని నిందించవలదు. అతను నిమిత్తమాత్రుడు!** అని. కాసేపు విశ్రమించాడు. విచిత్రమేమంటే అది పుష్పించుకాలము కాకపోయిననూ ఆ రెండు కవల చెట్లు తథాగతుని గౌరవార్థమా అన్నట్లు చక్కటి పూలతో ఉన్నాయి. బుద్ధుడు మెల్లగా **"ఆనందూ! స్త్రీ పురుష భేదం లేక సత్యకాములై, ధర్మ వర్తనులవండి. అంతకు మించిన మోక్ష సాధన లేదు** అన్నాడు. రాత్రి గడచుచున్నకొద్దీ అవసానదశ దగ్గర పడజొచ్చింది. శిష్యులు గురువు శయ్యచుట్టూ చింతాక్రాంతులై యున్నారు. ఆనందుడు రోదించుచు ఇట్లన్నాడు.



**ఆ॥ మానవాళి కొరకు మమ్ముద్ధరించంగ**
**కల్పమంతమయెడి కాలమైన**
**ఉండుమయ్య నిలిచి ఓ బుద్ధదైవమా!**
**జగతిపైన నీవు జాలి దలచి.**

ఈ మాటలని అతను పెద్దగా రోదించ సాగాడు. కాసేపయ్యాక తేరుకుని **"భగవాన్! నిరాశ్రయుడవై ఈనట్టడవిలో తనువు చాలించకండి. కాశీనగరంలో మిమ్మల్ని కళ్ళకద్దుకునే వారున్నారు. అక్కడ మీ తనువు చాలించండి"** అన్నాడు.

నీరసంగా నవ్వుతూ ఇలా అన్నాడు. **"ఆనందూ! తథాగతుని దేహానికేం కావాలో నీవు చింతించకు నీవు స్థిర ధీరచిత్తుడవై నీవు మంచి అని నమ్మినది చెయ్యి. జాగ్రత్త మరువకుము. నా కళేబరానికి ఎన్ని అలంకరణలు చేసినా లాభమేమి? అయిననూ ఆ ముచ్చట తీర్చుకొనువారు ఆవనిజేసెదరు. నీవు మాత్రము నాకు అత్యంత ప్రీతిపాత్రులిద్దరిని జగతికి యెరింగించుము. నేను బుద్ధుని**



**గాక మునుపు సుజాత అను యువతి పెట్టిన భోజనము మొదటిది. రెండవది నాకు చందుడు పెట్టి నాకు మహా పరినిర్వాణము నొసంగుచున్న అతని భోజనము. వారిద్దరూ నాకత్యంత ఆప్తులు. ఇది అందరికీ యెరింగింపుము. చందునికి నా ప్రత్యేక కృతజ్ఞతలందింపుము.**

దుఃఖమాపుకోలేని ఆనందుడు ఆవలి ప్రక్కకు వెడలిపోయెను. కొంతసేపయ్యాక బుద్ధుడు **"సోదరులారా! ఆనందుని పిలవండి. నాకు ఎక్కువ సమయము లేదు"** అన్నాడు. దుఃఖం దిగమ్రింగి తన ఎదుట నిలిచిన ఆనందుతో తథాగతుడిట్లనెను. **"నాయనా! ఎంత అజ్ఞానివవుతున్నావు. నామము ఉనికి కలిగిన దేదైనా నశించవలసినదే కదా! నీవునూ అనతికాలంలో నావలెనే ఈమాయనుండి అజ్ఞానము నుండి విముక్తి పొందెదవు. మరి విచారమెందుకు"** అన్నాడు.

రాత్రి గడుచుచున్నకొద్దీ తథాగతుని క్షీణింపు అధికమయ్యెను. ఆ సమయమున సుభద్రుడను బ్రాహ్మణుడచటకు వచ్చి **"ఆనందా! తథాగతుడు సిద్ధిబొందుచుండెనని వింటిని. నాకు కొన్ని**

**సందేహములున్నవి. అవి గౌతమ శ్రవణులు మాత్రమే తీర్చగలరు. తరువాత ఎవరూ నా సందేహము తీర్చలేరు"** అన్నాడు. **"ఇది అందుకు సమయమా శ్రవణులే స్థితిలో ఉన్నారో చూసుకోవద్దా"** అన్నాడు ఆనందు.

అది విన్న బుద్ధుడు ఆనందుని మెల్లిగా వారించి సుభద్రుని అడుగమనెను. ఆతను **"ఓ శ్రవణా! నేను జిజ్ఞాసువును. నన్నొక సందేహము పీడించుచున్నది. తపశ్శాలురైన** కశ్యపునివంటి బ్రాహ్మణులకు **తత్త్వమును** గ్రహించిరా? **లేదా? వారికి జ్ఞానమార్గమున ముక్తి లభించునా? వారు మోక్షార్హులా** అని అడిగాడు.

దానికి తథాగతుడు **ఇతరుల సంగతి నీకెందులకు నీవు వినగోరిననూ చెప్పు సమయము నాకు లేదు. ఒక్కటి మాత్రం చెప్పగలను "నీతి మార్గమును వదలివేసి మత సిద్ధాంతములను పట్టుపట్టుకొని వేలాడు వారికి మోక్షము సిద్ధించదుగాక సిద్ధించదు. పవిత్ర జీవితము గడుపుచూ దయాళువై అష్టాంగ మార్గమునవలంభించి ధ్యానమునందు కాలము గడుపు వారికి తప్పక మోక్షము లభించును. ఇందు సందియము లేదు"**



అన్నాడు.

వెంటనే అతడు తనకు బౌద్ధ దీక్ష నిప్పించమని బుద్ధుని వేడుకొనెను. దానికి తథాగతుడు **"సుభద్రా! నీవు మీమతములో ఉన్నత స్థానములో నుంటివి. నేడు బౌద్ధమున తక్కువ స్థానమునకు రావలెనన్న నాలుగు మాసములు శుశ్రూష చేయవలెను అన్నాడు. "అందుకు సిద్ధమే దేవా!"** అని స్థిరంగా అన్నాడు నిశ్చయంతో సుభద్రుడు. వెంటనే బుద్ధుడు ఆనందుని బిలిచి సుభద్రునికి బౌద్ధ దీక్షనిమ్మని ఆదేశించాడు. ఆనందు డాతనికి శిరోముండనం చేయించి సన్న్యాస దీక్షనిప్పించి, త్రిశరణములను నేర్పాడు.

అప్పుడు బుద్ధుడాతనిని శిష్యునిగా అంగీకరించి ధ్యానము చేయుటకొక ఉత్తమ మార్గము దెలిపెను. బుద్ధభగవానుడొనరించిన కడపటి కార్యమదియే.

రాత్రి నాలుగవ జామున బుద్ధుడు ఆనందుని బిలిచి **"ఈ నా మతమును మీకు కూలంకషంగా తెలిపి యుంటిని. కాలానుగుణంగా స్వల్పమైన మార్పులు మీరు చేసుకొన వచ్చును. సత్యము ధర్మములయందు నిశ్చయముతో**



**నుండవలెను'.** అని, **అందరినీ బిలిచి** "ఇక **సమయమైనది, భిక్షులారా! తరువాత విచారించి లాభము లేదు.** ఏవన్నా **అనుమానాలుంటే అడగండి** అన్నాడు.

కడకు ఆనందుడిలా అన్నాడు **"ఓ మహాభిక్షూ! బుద్ధుని గూర్చిగాని, ధర్మము గూర్చి గాని, సంఘము గూర్చిగాని మాకే సందియములు లేవు. నేను ఈ మాట నిశ్చయముగా చెప్పుచున్నాను.**

దానికి బుద్ధుడు తృప్తిగా **"సోదరులారా! నాకడపటి మాటలు వినండి.**

**కం॥ తెలియుడు, ద్వంద్వ పదార్థం**
**బులకెన్నటికైనగాని "బోవుట" విధియే**
**కలిగిన శ్రద్ధయు, నమ్మిక**
**విలువగు మోక్షంబుగనుట వింతగునె 'భళా!'**

ఆ తరువాత బుద్ధభగవానుడు గాఢమైన ధ్యాన సమాధిలోకి పోయి ప్రపంచ జ్ఞానాన్ని విడిచిపెట్టి చిత్తమును



నిర్వికల్ప సమాధిలోకి చేర్చెను. అది చూచి ఆనందుడు అనిరుద్ధునితో బుద్ధ భగవానుడు సిద్ధి పొందినారని చెప్పాడు అనిరుద్ధుడు "అన్నా! అదికాదు బుద్ధదేవులు, సుఖదుఃఖములకు అతీతమైన ఆలోచనా రహితమైన నిర్వికల్ప సమాధిని బొందా" రన్నాడు.

అనంతరం బుద్ధభగవానుడు ఆ స్థితిలోనే కొంతసేపుండి భౌతిక దేహత్యాగం చేశాడు.

## 13. బుద్ధుని తరువాత బౌద్ధం :

బుద్ధుని నిర్యాణం తరువాత అజాతశత్రు రాజగృహలో పెద్ద స్మారక సభ ఏర్పాటు చేశాడు. మహాకాశ్యపుడు అధ్యక్షత వహించిన ఆ సభకు పంచశతక అని పేరువచ్చింది. 500 మంది బౌద్ధ భిక్షువులు అందులో పాల్గొన్నారు.

బుద్ధుని జీవితం, బోధనలు, నియమాలు ఒక క్రమంలో గ్రంధస్థం చేయాలని సంకల్పించారు. వృద్ధుడైన 'ఉపాలి', ప్రియ శిష్యుడైన ఆనందుడు, మహాజ్ఞానియైన కాశ్యపుడు ఆ బాధ్యతలను చేపట్టారు. వారు వ్రాసిన రచనల్ని చెప్పిన బోధనల్ని 'త్రిపిటకములు' అన్నారు. పిటకము అంటే 'బుట్ట' అని అర్ధం. వాటి ఆధారంగా ప్రపంచంలోని అనేక దేశాల్లోని మీరు అనేక భాషల్లో బుద్ధ వాఙ్మయం వెలువరించారు. నేటికీ వాటి స్ఫూర్తితో పలువురు బుద్ధుని కథలను ఎన్నో భాషలలో చెబుతూనే ఉన్నారు. నాబోటి సామాన్యుడు కూడ ఇది వ్రాయగలిగాడంటే తథాగతుని స్ఫూర్తి ఎంతగొప్పదో కదా! త్రిపిటకముల గురించి గాని, బుద్ధుని తరువాత వెయ్యి



సంవత్సరాల కాలంలో పైకెగసి, పడిపోయి నేడు ప్రశాంతంగా జాలువారుతున్న బౌద్ధం గురించి సూక్ష్మంగా తెలిసినవారే కాని, స్థూలంగా తెలిసిన వారు బహుకొద్దిమంది. ఎంతోమంది నాలాంటి అతి సామాన్యులు కూడ తమకు 'తెలిసిన విధంగా' బుద్ధ చరిత్ర చెప్పసాహసించినా, ఇదమిద్ధంగా చెప్పలేనిది బుద్ధ చరిత్ర.

విదేశాలైన శ్రీలంక, కాంబోడియా, చైనా, జపాన్ వంటి దేశాల్లో ఆదరించబడుతున్న బౌద్ధం, అది పుట్టిన భారతదేశంలో ఎందుకు దాదాపు అంతమయింది? అని, నాకుతెలిసినంత వరకు చాల క్లుప్తంగా చెబుతాను.

త్రిపిటకములు మూడింటిలో మొదటికి 'ఉపాలి' చెప్పిన 'వినయపిటకము' అందులో బుద్ధుని జీవిత చరిత్ర, ఆనాటి భారతీయుల ఆచార వ్యవహారాలు, అలవాట్లు, ఆ మతగురువుల నియమ నిబంధనలు, బౌద్ధ సంఘశిష్యుల శిక్షణ – గురించిన వివరాలుంటాయి. దాంట్లో నాలుగు ప్రధాన భాగాలున్నాయి. 1. పాటిమొక్కహ 2. సుత్తి విభంగ 3. ఖాండక 4. పరివార. ఇంతకు మించి వివరాలు



కావాలంటే ఇక్కడ అసాధ్యం.

రెండవ పిటకము ఆనందుడు చెప్పినది. దానిపేరు స్తుతి పిటకము. అందులో బుద్ధభగవానుడు ఆనందుని సమక్షంలో చెప్పిన ప్రసంగాలు. సారిప్రత్త, మగ్గల్లాన వంటి గొప్ప జ్ఞానులు చేసిన ఉపన్యాసాలు, సూక్తులు, బుద్ధుని సుభాషితాలు, ధ్యానమునకు సంబంధించిన ఎన్నో రహస్యాలు ఉన్నాయి. బుద్ధుని జీవిత చరిత్ర ఆనందునికి తెలిపిన విధంగా వివరించబడింది. ఇందులో 5 భాగాలున్నాయి. 1. బుద్ధుని బోధనలు. 2. బుద్ధుని ఉపన్యాసాలు 3. ప్రసంగాలు 4. సాంప్రదాయ సిద్ధాంతాలు 5. చర్చలు. వాటిని "నికాయ" అంటారు. అవి మళ్ళీ 5 ఉన్నాయి. అ) దిగ నికాయ. ఆ) మజ్జిమ నికాయ. ఇ) సంయుత్తి నికాయ. ఈ) అంగుత్త నికాయ. ఉ) ఖుద్దుక నికాయ.

(ఇంతకు మించి వివరణ ఇవ్వటం ఇక్కడ సాధ్యం కాదు)

కాశ్యపుడు రచించిన 'అభిదమ్మ పిటకము' మూడవది. ఇది మూడిటిలోనూ ముఖ్యమైనదని అంటారు. ధర్మ



వివరణలు, వేదాంత తత్త్వరహస్యములు, అధ్యాత్మిక సిద్ధాంతాలూ, ఇందులో వివిధ రకములుగా వివరించబడ్డాయి. కేవలం జ్ఞానమార్గమే కాక అతీత జ్ఞానానికి సంబంధించిన పరిశోధనలు కూడా ఉన్నాయి. అందులో అంతరాత్మ స్వరూప స్వభావాలు వివరించబడ్డాయంటే అంతరాత్మ వివరణ ఇచ్చారంటే సామాన్యమైన విషయం కాదు. మనోశక్తి, అది చేయగల అద్భుతాలూ వివరించబడ్డాయి అంటే సామాన్యమైన విషయం కాదు. అన్నిటికన్నా ముఖ్యమైన నిర్వాణ స్థితిని అందుకోవడం ఎలాగో వివరించారంటే ఆ విజ్ఞాన మహాసాగరంలో మనం నీటి బిందువన్నా కామని తెలియటం లేదూ.

భగవద్దర్శనం కాక ఇవన్నీ ఎవరన్నా చెప్పగలరా. ఆనాటి బౌద్ధ సన్యాసులు తమ ఆత్మరక్షణ కోసం కనుకున్న 'కరాటే' 'కుంగ్‌ఫూ' ల వంటి 'మార్షల్ ఆర్ట్'లు మనం నేడు వింతగా చూస్తున్నామంటే మాటలా? ఏడు వరుసలుగా పేర్చిన ఇటుకలను ఒక అరచేతి చరుపుతో పగులగొడుతున్నారంటే

–ఎక్కడిదా దివ్యశక్తి? మన ఏకాగ్రతది. అది మనలోనే ఉందని బౌద్ధ సన్న్యాసులు నిరూపించారు.

అభిధమ్మ పిటకములో ఏడు భాగాలున్నాయి. 1. ధర్మ సంగణి 2. విబ్భాంగి 3. కథవట్టహా 4. పుగ్గల పన్నాటి 5. ధాతు 6. యమక 7. పత్తాన.

ఆ మూడు పిటకములను కలిపి త్రిపిటకములంటారు. క్రీ.పూ. 80వ సంవత్సరం వరకు అవన్నీ మౌఖికంగానే ఒకరినుంచి ఇంకొకరు వినుట చేత ప్రాచుర్యం చెందాయి. తరువాత శ్రీలంక రాజైన పట్టగామిని చేత గ్రంధస్తం చేయబడ్డాయి.

బుద్ధత్వం పొందిన వారిని బోధిసత్వుడు అంటారు. వారు అనేకులుంటారు. ఏ జన్మలో బుద్ధత్వం లభిస్తే అప్పటినుంచి వానిని బుద్ధుడు అంటారు. ఇప్పటివరకు మనం తెలుసుకున్న చరిత్ర శుద్ధోధనుని పుత్రుడైన కపిలవస్తు రాకుమారుడు సిద్ధార్ధునిది.

బోధిసత్వులు అయ్యేలోగా ఆ బుద్ధుడు రకరకాల



జన్మలెత్తి మంచినీ, తన అనుభవాన్ని చెప్పే జాతక కథల ద్వారా బోధిస్తాడు. బౌద్ధ వాఙ్మయంలో ఈ జాతక కథలు పల్లె ప్రజల్ని కూడా నీతిమంతులుగా చేశాయి. వీటిని అనుకరించి వివిధ మతాలలో ఎన్నో గాథలు వ్యాప్తిలో కొచ్చాయి అంటారు. ఏది ఏమయినా చిన్న పిల్లల్ని కూడా ఆకట్టుకునే ఈ జాతక కథలు సాటిలేనివి.

బుద్ధుని తర్వాత ఏడాదికి జరిగిన రెండవ మహా సభలు వంద సంవత్సరాలకి జరిగాయి. పాతవాళ్ళంతా అంతరించారు. కొత్త అధ్యక్షులు "కాకవర్ణి'. బౌద్ధుల మధ్య విభేదాలు బహిర్గతమయ్యాయి. థేరులు, మహా సాంఘికులు అని రెండు వర్గాలుగా విడిపోయారు వారు. మూడు వందల సంవత్సరాల తర్వాత థేరులు, హీనయానం బౌద్ధులుగానూ, మహా సాంఘికులు, మహాయానం బౌద్ధులుగానూ అవతరించారు. ఇంతకంటే వివరించటం ఈరచన యొక్క అవధి కాదు మహాయానానికి బోధిసత్వ యానం అనికూడ పేరువచ్చింది.



హీనయానం బర్మా, శ్రీలంక, సయాం, జపాన్, దేశాలలో వ్యాప్తి చెందింది.

క్రీ.పూ. 286 నుండి 236 వరకు అశోకచక్రవర్తి ప్రాపకంలో కళింగయుద్ధం తర్వాత భారతదేశంలో బాగా విస్తరించింది. ఆయన కుమార్తె 'సంఘమిత్ర' శ్రీలంకలోను, (ఆమె భర్త అగ్నిబ్రహ్మ) బౌద్ధ భిక్షువు, అశోకుని కొడుకు మహేంద్ర ద్వారా భారతదేశంలోనూ, చెల్లెలు యమలాదేవి ద్వారా సిరియా, బర్మాల్లోను బౌద్ధం వ్యాపించింది.

క్రీ.పూ. ఒకటవ శతాబ్దిలో హూయన్ సాంగ్ వంటి చైనీయులు బౌద్ధ ధర్మం నేర్పటానికి భారతదేశం సందర్శించారు. ఆనాటి జనసందోహం యొక్క భావాలు స్థితిగతులు కొంత అవగాహనమయ్యాయి. బ్రాహ్మణుడు, గొప్ప సంస్కృత పండితుడు, కవి, వాల్మీకి రామాయణం వల్ల ప్రభావం చెందిన అశ్వఘోషుడు బౌద్ధం స్వీకరించి బుద్ధ చరిత్ర, సౌందర నందనం, సూత్రాలంకారం వంటి పెక్కు రచనల ద్వారా బౌద్ధ వ్యాప్తికి నూతన జీవం పోశాడు. అందులో సౌందర నందనం, నందుడు (బుద్ధుని పినతండ్రి కొడుకు)



వివాహమంటపం నుంచి లేచి సన్న్యసించడం, అతని భార్య మనోవేదన. నందుడు పడే డోలాయమాన భ్రాంతి, బుద్ధుడు అతనికి వైరాగ్యం బోధించుట, నందుడు ధీరచిత్తుడై అర్హత స్థానాన్ని పొందడం – హృద్యంగా తెలుపబడ్డాయి. జన బాహుళ్యం చేత కీర్తించబడిన రచన అది.

క్రీ.శ. 2,3 శతాబ్దాలలో ఆంధ్రదేశంలో బౌద్ధానికి కొత్త వెలుగు దివ్వెనందించినవాడు ఆచార్య నాగార్జునుడు. ఆయన గొప్ప కళాప్రియుడు. అమరావతి, ఘంటసాల, జగ్గయ్యపేట, నాగార్జునకొండ – వంటి అనేక ప్రదేశాల్లో ఆనాడు జగద్విఖ్యాతంగా (ఈనాడు శిధిలాలుగా) ఉన్న బౌద్ధ శిల్పకళ ఈయన చలువే.

ఏడవ శతాబ్దంలో శాతవాహన చక్రవర్తి వద్ద మంత్రిగా వున్న నాగార్జునుడు (వీరు రెండవవారు) ధరణికోట, నాగార్జున కొండవద్ద బౌద్ధ విద్యా పీఠాలు నెలకొల్పి ఆచార్యుడై బౌద్ధ కీర్తిచంద్రికలు విస్తరింప చేశాడు. ఆ రోజుల్లో బౌద్ధంలో 'వజ్రయాగం' అనే శాఖ వెలిసింది. బౌద్ధంలో అనేక దేవతలు మహిమలు వచ్చి చేరాయి. క్రీ.శ. 400 నాటికి బౌద్ధానికి

భారతదేశంలో రాజాదరణ తగ్గిపోయింది. కులవ్యవస్థ ప్రాపకంలోకొచ్చింది. ఆదిశంకరుని అద్వైత సిద్ధాంతం ముందు, బౌద్ధంలో ఆనాడున్న శూన్యవాదం నిలువ లేకపోయింది. మనుగడ కోసం పోరాడిన బౌద్ధం స్వరూపాన్నే కోల్పోయింది.

అయితే కొరియా, టిబెట్ వంటి పలు దేశాల్లో అక్కడి పరిస్థితులకనుగుణంగా మారుతూ చిగురించి పుష్పించింది. అనేక దేవతల సంఘర్షణలో భారతదేశంలో అద్వైత, విశిష్టాద్వైత, ద్వైత శుద్ధ అద్వైత వంటి రకరకాల మతాల మధ్య హరిహరుల మధ్య విభేదం సృష్టించి హిందూమతం సతమతమవుతుంటే, బుద్ధం శరణం గచ్ఛామి అన్న బౌద్ధం ఇతర దేశాల్లో విశ్రాంతిగా ఊపిరి పీల్చుకొని వృద్ధి చెందింది.



**చం॥ పెరుగుచు విస్తరించినది వేయి వసంతము**
**లంత ఈ భువిన్**
**తరుగుచు నూత్న రూపములు దాల్చెను బౌద్ధము,**
**అందుచేతనే**
**గురువులు దాని బెంచుటకు క్రొత్త తలంపున**
**ఆ తథాగతున్**
**హరి అవతారమంచనిరి, అనృతమా అది?**
**కాదు నిక్కమే.**

ఇందులో విభేదించే వారికో నమస్కారం. అయ్యలారా! ఎవరి పిచ్చి వారికానందం అనుకోండి. బౌద్ధ ధర్మాన్ని కాశ్యపుడు పెంచలేదా? అట్లాగే నేను కూడ ఏదో జన్మలో బౌద్ధుణ్ణయి ఉంటాను. ఈ జీవయాత్రలో జన్మల రహస్యాలు ఎవరికి తెలుసు?



## 14. నేడు బౌద్ధము దాని ఆవశ్యకత

ఇప్పుడు క్రీ.శ. 2008 కి వచ్చేసింది కాలచక్రం. బుద్ధుడు హరి అవతారమన్నా ఆగ్రహించి అన్నవాణ్ణి చంపే రోజులు వచ్చేశాయి. బుద్ధ భగవానుని నాటికి 'కలికాలం' వచ్చేసింది అని కొందరు నోళ్ళు నొక్కుకుంటే మరి నేడు వచ్చిన ఈ 'ఆకలికాలం' మాట ఏమిటి' ధర్మం శరణం గచ్ఛామి అన్న బుద్ధ దేవుని మార్గం నిండా 1. హింస 2. మారణ కాండ 3. అసత్యం 4. లంచగొండితనం. 5. దురాచారం, 6. మతమౌఢ్యం 7. దుస్సాంగత్యం. 8. దురాలోచన. 9. దుష్ట రాజనీతి 10. దురలవాట్లు వచ్చాయి. బుద్ధుడు మోక్ష మార్గానికి చెప్పిన ఆ పది సూక్తులు ఏవి? ఈ కొత్త దురూక్తులెక్కడినుంచొచ్చాయి. డబ్బు, మనీ, ధనం, పైకం, డాలర్, రూపాయి విశ్వరూపం చూపుతున్నది. బయటకు వెళ్ళిన వాడు తిరిగి వస్తాడని నమ్మకం లేదు. ఇది రూపాయికి ఒకవైపు ఇక రూపాయి రెండవవైపు మునుపెన్నడూ లేని కొత్త కొత్త పూజా విధానాలు సమారాధనలు, శాంతి యజ్ఞాలు,



జాతరలు, బలులూ వ్యాప్తి చెందుతున్నాయి. ఓ శ్రీమన్నారాయణా! నీవు నవీన బుద్ధుడివై వచ్చి మమ్మల్ని కాపాడాలి. ఇవ్వాళ సద్బ్రాహ్మణుడై పుట్టిన ఒక దీక్షితులు నాకు 'నారాయణుడు' చాలు ఈ నాన్సెన్స్ వద్దంటున్నాడంటే నా ఆవేదన అర్థం చేసుకో. ఆకలి వేసినవాడు గుళ్ళో ప్రసాదం తిని కడుపు నింపుకునే రోజులు పోయి దారిప్రక్కన ఎండలో చంటిపిల్లవాణ్ణి ఎత్తుకుని కన్న తల్లిలా నటిస్తూ అడుక్కుని ఆ డబ్బుల్లో ఇంకా కొంతమంది మగాళ్ళకి వాటా ఇస్తూ బ్రతికేస్తున్న రోజులొచ్చాయి. ఈ నోట్ల లెక్కింపులో అసలు బుద్ధ భగవానుడు వస్తాడా ఈ భూమ్మీదకు, రాడా? వస్తాడు "సంభవామి యుగే యుగే....." ప్రభూ! ఇప్పటికే ఆలస్యం అయింది. రా..... దివినుంచి భువికి దిగిరా.

**కం॥ రారా దిగి యీ భువికిన్**
**రా! రా! రావయ్య నీవు రాజీవాక్షా!**
**రారా ఏదో రూపున**
**రా! రా! ఈ హింస నాపు రా! బుద్ధుడవై.**

## 15. ముగింపు

**బుద్ధం శరణం గచ్ఛామి**
**ధర్మం శరణం గచ్ఛామి**
**సంఘం శరణం గచ్ఛామి ...... ఇవి చాలు.**

"మాధవా! కేశవా! మధుసూదనా....

అని పాడి ఆ కీర్తనలో అన్నమయ్య బుద్ధుడు శ్రీమన్నారాయణుడన్నాడు. మనకి అంతకంటే ఎక్కువ తెలియదని నమ్ముతూ నేను కూడా బుద్ధ భగవానుడు విష్ణు అవతారంగా భావిస్తున్నాను.

ఆయన తను దేవుడినన లేదు. దేవుని నమ్మలేదు. ఆత్మ మనం అనుకున్నది కాదన్నాడు. నిజమే. శ్రీరామచంద్రుడు కూడ తను దేవుడినని చెప్పలేదు. (వాల్మీకి ప్రకారం) తనపని రామరాజ్య స్థాపన అన్నాడు. అంతమాత్రాన ఆయన నారాయణుడు కాదా.



ఇటీవల కాలంలో వచ్చిన తులసీదాసువంటి మహాభక్తులు రాముడు అడుగడుగునా తను పరబ్రహ్మాను అనే సుస్పష్టం చేశాడని వ్రాశారు. అదే విధంగా వజ్రయానంలో బుద్ధుడు విష్ణువనే భావన ప్రచారం చేసి ఆయన అవతారంగా కీర్తించింది.

మేము ఏ కులానికి చెందము మాకు కులం వద్దు అనుకునేవాళ్ళు బౌద్ధం స్వీకరించినట్లు మనకు సుస్పష్టమే. నిజానికి కులవ్యవస్థ మన ప్రజలకు కష్టాలు తెచ్చి పెట్టిందేమో. మనది మానవకులం అనుకోవటం మంచిది కదా! ఇప్పుడు కులాన్ని పేరు చివర తగిలించుకుంటున్నారు వారి మాటేమిటి? లోకోభిన్న రుచిః ఎవరికేం చెప్పగలం.

పరనింద, పరవిమర్శ వల్ల ద్వేషం విస్తరించి బుద్ధభగవానుని ఆత్మకు తీరని అశాంతినిస్తుంది. మానవత్వం లేని దైవత్వం వ్యర్థం.



**ఉ॥ ఇంతకు మించి చెప్పుటకు ఏమియు లేదిక**
**మిత్రులార! నా**
**కెంతటి పుణ్య ప్రాప్తమున నివ్విధి 'బుద్ధ చరిత్ర'**
**జెప్పితిన్**
**సంతసమాయె ధన్యుడను జన్మతరించెను**
**తప్పులున్నచో**
**పంతము మాని మెచ్చుడిది "బాలునియత్న"**
**మనంచు నవ్వుచున్**

**"అహింసా పరమో ధర్మస్త్వధర్మః ప్రాణినాం వధః"**

అహింసను మించిన ధర్మంలేదు, హింసను మించిన అధర్మం లేదు – అని ఆర్యోక్తి.

సర్వేజనాః సుఖినోభవంతు



